# శ్రీ అరవిందార్చన

ఆగష్టు ౧౫-౧౯౪౯

జయంతి సంపుటి ౧

శ్రీ

# అరవిందార్చన

జయంతి సంపుటి ౨

ఆగష్టు ౧౫-౧౯౪౯

# శ్రీ
# అరవిందార్చన

జయంతి సంపుటి ౨

ఆగష్టు ౧౫-౧౯౪౯

# విషయ సూచిక

# శ్రీ అరవిందులు

[శ్రీ అరవిందులు రాజకీయనాయకులుగ, మానవాత్మకునిగ, అసామాన్యగుణములు కలిగి యుండిరను విషయమును వివరించుచు వారికి సహాయకారుడుగను, వారితోపాటు జాతీయ నాయకుడుగ నుండిన బిపిన్‌చంద్రపాలుడు 1909-1910 సంవత్సరమున లండనుపట్టణమున తాను రచించుచుండిన "స్వరాజ్య" పత్రికయందు వ్రాసియుండిరి. అప్పటి కాలమున బ్రిటిషుగవర్నమెంటుచే నిర్వాసితమైన నాయకులగురించి నతడువ్రాసిన స్వభావ వర్ణనలలో నిది యొకటి. ఈ వర్ణనలకు వారు సూక్ష్మదృష్టి, విశాలభావములతో రమ్యసారస్వతరూపము నిచ్చుటచే వానికిగల విశిష్టత.]

శ్రీ అరవిందులు హిందూదేశమున జాతీయప్రచారమునం దగ్రగణ్యులలో అందరికన్న చిన్నవయస్కులు, కాని స్వభావోన్నతియందు, విద్యయందు, సంపన్నతయందు అందరిలో శ్రేష్ఠులు. సమకాలికులలో వీరీ ఉద్యమమునందు తమ సహచరులెవ్వరును వహించలేని కార్యభారమును వహించుట భగవదుద్దేశ్యమై యుండెననుట స్పష్టము. ఈ ఉద్యమమునందలి యితరనాయకుల జీవిత విశేషము భూతకాలములో నంతమయ్యెను; కాని శ్రీఅరవిందులు తమజీవితముతో భవిష్యత్తును పూర్ణమొనరించ నున్నారు. ప్రియవిషయములందు జాతీయోద్యమము వారికి కడపటిది; శ్రీఅరవిందులకది మొదటిది. ఇతరులు పెద్దకుటుంబపు బాధ్యతలు, చింతలు కలిగి సంకీర్ణసంబంధము జీవితమునందు కలవారు; శ్రీఅరవిందుల కుటుంబముచిన్నదై, వారు ప్రాపంచిక బాధ్యతాభివృద్ధి కవకాశము లేనివారు. 'మాత' అని నిరంతరము వారిచే పిలువబడు దేశమొక్కటియే వారి చింతన. వారు గుర్తించిన బాధ్యతలన్నియు ఆమెను గురించియే. దేశాభిమానము కొందరియందు వారి బుద్ధినాశ్రయించి పనిచేయుచున్నది, మరికొందరియందు జాతీయోద్రేకతను కలిగించి పనిచేయుచున్నది. కాని శ్రీఅరవిందులయందు ఆత్మ యొక్క పరమా

కాంక్షగా నావేశించి పనిచేయుచున్నది. జాతీయాదర్శమును శ్రీఅరవిందులు గ్రహించినవిధమున నేకొలదిమంది మాత్రమే గ్రహించగలిగి యున్నారు. ఈకొందరియందును వారిదృష్టి శుద్ధమే యయ్యును, వారి కార్యములు బలహీనములై యున్నవి. మనుష్యుడు తనయిచ్ఛయొక్క యొకానొక శాసనముచే తనజీవితమును తక్షణమే సృష్టించుకొనజాలడు. మనకర్మ దినదినమునను, జన్మజన్మమునను మనల వెంబడించును. అనేకసూక్ష్మతమ స్వభావులు, సత్యమును దర్శించియు, నితరబంధనముల, బాధ్యతల త్యజింపజేయజాలని పరమావేశమును పొందజాలకుండుట ఈశ్వరనిర్దిష్ట శోచనీయస్థితియై యున్నది. సెయింటుపాలుడు జీవిత ప్రతి దుర్ఘటపథమందును, 'ఆత్మ యిచ్ఛగించు చున్నది, శరీరము దౌర్బల్యమై యున్న' దని వాపోయినట్లు వీడును వాపోవలసియున్నది. భావమునకును, దాని కార్యనిర్వహణమునకును దుఃఖకర పరస్పరవిరుద్ధత లేనివారును - సత్యమును తెలిసికొనుటయే దానిని ప్రేమించుటయై, ప్రేమించుటయే దానికొరకు ప్రయత్నించుటయై, ప్రయత్నించుటయే దానిని సిద్ధింపజేసికొనగల వారును - భావమునకును దాని అనుభూతికిని, మధ్య పరిమాణ భేదములు లేనివారును - ఆదర్శక దృశ్యమునందు గల సహజశక్తిచే, భౌతికకోరికలను, మానసిక ప్రవృత్తులను, హృదయావేశములను, ఇచ్ఛావేగములను తమయందు సమన్వయింప జేసినవారును - దాని అనుభూతి ఆంతరమున సిద్ధింపబడి బాహ్యమున మాత్రమే సిద్ధింపబడ వలసినదిగా యుండువారును - తమయందలి ఆత్మనుగాక పరులయందలి ఆత్మను సంస్కరింప వలసినవారును - తమ ఆంతరముతోగాక, యితరులతో పోరాడి జయించవలసి యుండువారును—ఈశ్వరసామ్రాజ్యమును తమ ఆంతరజీవిత సంబంధములం దుపలబ్ధి పొంది, దేశముయొక్కయు, మానుష్యకముయొక్కయు జీవిత సంబంధములందు సాధింపవలసిన వారును నగు వీరలే ధన్యులు. వీరలే భగవానుని శిష్యులు; వీరలే మానుష్యకము యొక్క సహజనాయకులు. గొప్ప ప్రజాసమూహముల సౌఖ్యమును, జీవితమును ప్రత్యేకగమ్యమునకు జేర్చ నియమింపబడిన వారై, మోహనజీవనమును వారు ధరించి యుందురు. వారిపైన దెబ్బ వేయవచ్చును; కాని వారిని గాయపరుపలేరు; వారిని గాయపరుపవచ్చును, కాని వినాశనమొన ర్పలేరు. వారి కీశ్వరునియందుగల గాఢవిశ్వాసము, వారియందీశ్వరునికిగల కృప,

ప్రీతిచెడుగును మేలుగ, వ్యతిరిక్తతను సహాయతగను, నష్టమును లాభముగను, మార్చును. ప్రజాభిప్రాయమునందు శ్రీఅరవిందులు భగవంతుని యట్టి ప్రియ సంతానములలో నొకరు.

జన్మ ఆకస్మిక సంఘటన కాదు. ఆకస్మికమేయని చెప్పుట నాస్తికుని వాదము. ప్రకృతి తన విధానములందు ఆకస్మికమునకు తావివ్వలేదు. ప్రకృతి రహస్యములను తెలియజాలని మనుజుడు తన అజ్ఞానతను కప్పిపుచ్చుటకై ఈ వాదమును సృష్టించెను. అలల పతనోత్పతనము లెట్లు ఆకస్మికములు కావో మానవజన్మ యునంతే. పరిణామ పద్ధతియం దాకస్మికములుండవు; స్వాభావిక వరణధర్మమట్టి అవకాశముల నిర్మూలించినది. కాని, స్వాభావిక వరణక్రియ, అవయవి (Organism) పుట్టుటకు పూర్వమా లేక అనంతరమా ప్రారంభమగుట యను నది ప్రశ్న. అది ప్రాణికధర్మము ననుసరించునా, లేక మానసిక ధర్మమునుకూడ ననుసరించునా ? ప్రాణధర్మము ననుసరించు జీవశాస్త్రపు సమస్యలవలె, మానసిక శాస్త్రపు సమస్యలుకూడ స్వాభావికవరణ సిద్ధాంతము పైననే నిర్ణయింపబడగలవు. మనోభూమికయందుకూడ నిట్టి సిద్ధాంతమే వర్తించుననుట నిస్సందేహము. భౌతికావయవి తన యావశ్యకతలనుబట్టి జీవితము నందలి పరిస్థితులను కోరి నిర్మించుకొనునట్లే చైతన్యము కూడను. ఆనువంశికతత్వ విధానము, మనఃతత్వము నకుగూడ అన్వయించును. ఈ దృష్టి ననుసరించి, జీవితము చీట్లువేసి తీయునట్టిది కాదు. అది యొకధర్మమును విధానముననుసరించి యేర్పఱుపబడిన విషయము. నిమ్న ప్రాణిలోకమునందు, అవయవియొక్క అవసరములను అంగములోన కూర్చును; అట్లే మానవుని అవసరములను, అతని హృదయవాంఛలు గుమికూడి, అవి వాని కావశ్యకమగు పరికరమును సన్నాహమును సృష్టించి, నెరవేర్చును. మరేసూత్రముపైనను మానవజీవిత ప్రహేళిక సంతృప్తికరముగా సమన్వయింపబడుటలేదు; ఈ సూత్రము సమస్తవిషయములను సమన్వయించ నప్పటికిని అర్థముకాని అనేకవిషయములను సమన్వయించుచున్నది. పురాతన కాలమునుండి హిందువుల విశ్వాసమిది. ప్రారంభమున నిదియొక భావస్ఫురణగానుండి, తదనంతరము ప్రజయందు నిర్ధారితమగు విశ్వాసముగా పరిణమించెను; ఇప్పుడది కర్మతత్వ సిద్ధాంతముచే బలపరుపబడుచున్నది. ఈ సిద్ధాంతము శ్రీఅరవిందుల

విషయమున ఆశ్చర్యముగా నిదర్శింప బడినది.

శ్రీ అరవిందుల పితరులకాల మందు వంగదేశము ఆదర్శ, ఆకాంక్ష విచారములందు రెండుచీలికలుగా నేర్పడి వానిలో నొక్కొక్కటియు రెండవ దానిపై తనఔన్నత్యమును బరుప ప్రియత్నించెను. మొదటిది హైందవజాతీయత, – ఇది, కొన్నినూర్ల సంవత్సరములుగా అణగియుండిన జాత్యాదర్శములు, సభ్యత, పునరుద్ధాపకజీవితము, ఆంగ్లవిద్యాపర వంగీయుల మొదటిజట్టుచే, నిమ్నమని అసంస్కృతికమని, నిరాకరింపబడి యుండెను. రెండవది హిందూ – ఆంగ్లేయత; – దేశముయొక్క పర ప్రభువ్రల ఆదర్శములు, సభ్యత, ప్రవాహ వేగ జీవితము, ఆంగ్ల శాసన పరిపాలనముద్వారా, నూతనపాఠశాలల, విశ్వవిద్యాలయములద్వారా, ప్రికటించుకొనుచు, ప్రిజల పూర్వస్వభావమును, శిష్టతను ముంచివేయ సంశిద్ధమై యుండెను. శ్రీఅరవిందుల పితరులిద్దరును దేశమునందీ విరుద్ధశక్తులకు వేర్వేరు ప్రితినిధులై యుండిరి. మాతామహుడగు రాజనారాయణబోసు ఆధునికవంగదేశ నిర్మాత. డేవిడ్ హేర్ విద్యార్థి, డి–రోజారియో శిష్యుడు, హిందూకాలేజీ పాఠకుడు; ఈకాలేజి ప్రిథమ ఆంగ్ల కళాశాలయై, ఆంగ్లప్రిభువులచే, హిందూసంఘముచే కూడ, సహాయతపొంది పనిచేయుచుండెను. రాజనారాయణబోసు సాంఘిక, మతవిషయకశుద్ధిసంఘటన కార్యములను ప్రారంభించెను. నూతన ప్రికాశసంవేగము నుపలబ్ధి పొందుటలో తన సమకాలికులలో నెవ్వరికిని తీసిపోకున్నను, స్వజాతియొక్క సభ్యత నాగరకతల అంతర్భావమును కూడ నితరులకన్న పూర్ణముగా గ్రిహించెను. మహర్షి దేవేంద్ర నాథ్ ఠాకూరు అధ్యక్షతక్రిందనున్న బ్రహ్మసమాజమున చేరెను; కాని తర్వాత కేశవచంద్రిసేనుని అధ్యక్షతక్రింద నాసమాజము విజాతీయ స్వభావ మొందుటచే దానిని వదలుకొనెను. బ్రిహ్మసమాజమును కేశవచంద్రిసేనుడు పునఃస్థాపన మొనరించుటకు పూర్వము గల ఆయాది బ్రిహ్మ సమాజమునకు నాయకులగు మహర్షి దేవేంద్రినాథ్ ఠాకూరు, రాజనారాయణబోసుల నిద్దరిలో నెవ్వరా సమాజమును ప్రబలయుతముగ, విశుద్ధముగ, జాతీయముగ నొనర్చిరో చెప్ప జాలము. దేవేంద్రినాథుని జాతీయత ప్రబలమైన ఈశ్వర ధర్మ వా దాత్మ క మై యుండ, రాజనారాయణుని జాతీయత పైవాదమునేకాక, సాంఘిక రాజకీయ

ప్రాముఖ్యతగూడ కలిగి యుండెను. ఐరోపా క్రైస్తవ దురాక్రమణ నెదుర్కొనిన దతనియందలి హిందూమత అంతరాత్మయే కాక, హైందవ సభ్యత, పౌరుష ములుకూడ ఆ విజాతీయాధిపత్యమును, గౌరవమును ప్రతివిషయమందును ప్రతి ఘటించినవి. కేశవచంద్ర సేనుడు హిందూశాస్త్రములందలి సత్యమును, బైబిలుగ్రంథ ములందలి సత్యమును ప్రక్కప్రక్కన నుంచుచు, చూపెట్టుచుండ, రాజనారా యణబోసు క్రైస్తవమతమునకంటె హైందవమతమునగల ఆధిక్యతను చూపెట్టు చుండెను. ఆంగ్లేయుల పద్ధతిననుసరించి, హైందవసంఘ జీవితమును సంస్కరించు టకు కేశవచంద్రుడు వెతకుచుండ, రాజనారాయణుని దృఢ దేశాభిమానము జాతీయాత్మ గౌరవము, అట్టి కార్యము నత్యాచారముగ తలంచి తిరుగుబాటొన ర్చెను. క్రైస్తవ సాంఘికాదర్శములకన్న హైందవ సాంఘిక వ్యవహారనీతి మిన్న యైనదని చూపెట్టెను. ఐరోపీయవస్తువు లెక్కువగా హిందూదేశమునకు విక్రయ మునకు వచ్చుటంజూచి యితరులెవ్వరు తలంచక మునుపే స్వదేశోద్యమమును ప్రారంభించి, వానినరికట్టజూచెను. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్, హైందవ పారిశ్రామిక ప్రదర్శనశాలను గురించి తలంచుటకు ఇరువదియైదు సంవత్సరముల పూర్వమే హిందూమేలా, లేక హిందూవస్తు ప్రదర్శనశాలను స్థాపించెను. యువ కులకు శారీరిక శిక్షణనిచ్చుటకు, శిక్షణశాలలను ప్రారంభించిన ప్రథమ వంగీ యుడితడే. రాజనారాయణుని శిక్షణాదేశములవలన హిందూమేలాయందు, విస్మ రింపబడిన హిందూవ్యాయామములు, పందెములు, కత్తి కర్రసాములు పునరుద్ధ రింపబడెను. రాజనారాయణుడు బహిరంగముగా రాజకీయములందు పాల్గొనలేదు. కాని విద్యార్థులలో ఆత్మగౌరవము, స్వాత్మ నిర్ధారణమును కలుగజేసెను. ఈభావములు ప్రస్తుతరాజకీయ కార్యకలాపములందు పూర్ణముగ అభివ్యక్త మగుచున్నవి.

స్వదేశ పురాతనసంస్కృతి నాగరికతల యందలి మహోన్న తాధ్యాత్మిక జ్ఞానానుభవముపై సహేతుకముగా నాధారపడిన స్థిరత, జాతియందలి విశుద్ధ మహిత గౌరవమువలన కలిగిన సూక్ష్మగ్రాహక దేశాభిమానము, జీవితమందలి వివిధ వ్యావహారిక సంబంధముల ద్వారావ్యక్తపరచుకొనుచుండు గాఢభక్తి- యివి రాజనారాయణుని చింతన యొక్కయు, జీవితము యొక్కయు స్వభావములు.

స్వదేశమున, పఱుగుచుండిన వేదాంత, మహమ్మదీయ ఐరోపా సభ్యతల సమ్మిశ్రిత సమన్వయ శిష్టత స్వరూపమే అతడై యుండెను. బ్రహ్మజ్ఞానమును గురించి ఉపన్యసించి నపుడతడు ఉపనిషత్తుల యందలి హిందూతత్వ జ్ఞానమును బోధించెను. పర్షియాకవుల పద్యముల వల్లించునపుడు వానియున్నత స్వర సామంజస్యతను వెలిపుచ్చుచు ప్రేమచే కన్నులు దళీభూతమై, శరీరావయవయము లన్నియు ఆధ్యాత్మికావేశముతో మెరయుచు మహమ్మదీయ భక్తునివలె కనపడును. ప్రస్తుత మతమునందలి దోషములను గురించికాని, ఆధునిక రాజకీయ వేత్తల ఆత్మరహిత స్వార్థమును గురించికాని ముచ్చటించు నపుడు పందొమ్మిదవ శతాబ్దపు హేతువాదియు, ఐరోపాదేశ విగ్రహ విధ్వంసకుడును బోలె కనపడును. అతని మనస్సునందును, జీవిత మందును అత డేకకాలీనమున హిందూమహర్షిగను, మహమ్మదీయ సూఫీగను, క్రైస్తవ ఏకాత్మక సిద్ధాంతమునకు చెందిన ఈశ్వర వాదిగను నుండెను. బ్రహ్మసమాజ నిర్మాతయు, అనేక సంవత్సరములు దాని కధ్యక్షుడునై యుండిన రాజారామమోహానుని వలె, ఆధునిక హిందూదేశము నందొక దానితో నొకటి ప్రతిఘటించుకొను చుండిన విశ్వప్రముఖ శిష్టతల మూడింటిని తన జీవితమునందు సంయోగ మొనర్చుకొని యుండెను. రామమోహానునివలె, రాజనారాయణుడును, దేశమునందలి రాజకీయ, ఆర్థిక, సాంఘికాదర్శములను సమ్మేళన మొనర్చి వానిని హైందవ జాతీయాదర్శముగా, ప్రస్తుత సంతతివారి కనుగుణ్యముగా, సమన్వయ మొనర్చి భౌద్ధికముగా ఆధ్యాత్మికముగా తనయందనుభూతిని పొందియుండెను. వంగ సారస్వతము నందును రాజనారాయణుడు నాయకుడై యుండెను. మాడరన్ రివ్యూ యందొక లేఖకుడు రాజనారాయణుని 'హైందవజాతీయ పితామహుఁ' డని పేర్కొనెను. ఈ రాజనారాయణుడే, శ్రీ అరవిందుల మాతామహుడు. వీరి యున్నత ఆధ్యాత్మిక స్వభావమును, సాహిత్యశక్తి యందౌన్నత్యమును, వంశ పారంపర్యముగ, తల్లి పక్షమునుండి శ్రీ అరవిందులు పొందిరి.

జాతియొక్క పురాతన ఆధ్యాత్మిక శక్తులకు మాతామహుడు ప్రతినిధియై యుండెనేని, శ్రీ అరవిందుల తండ్రియగు డాక్టరు కృష్ణధనఘోషు, తన దేశమునందలి నూతన వికాసమునకు ప్రతినిధియై యుండెను. డాక్టరు ఘోషు

ముఖ్యముగ ఆంగ్లవిద్య ఐరోపీయ శిష్టతల పరిణామ ఫలము. అనేకాంశములతో కూడిన నీతడు ఇంగ్లాండునందు విద్యనుపూర్తిచేసి అక్కడ డాక్టరు పట్టమునుపొంది ఇండియాగవర్నమెంటు ఉద్యోగమునందు చేరి, ఆకాలపు ఉద్యోగులలో విజయ శీలురలో నొకడై యుండెను. అకాలమరణమును పొందకుండెనేని, తనశాఖయం దగ్రస్థానమును తప్పక వహించెడివాడు. ఇంగ్లాండునందు విద్యను ముగించిన ఇతర హిందూయువకుల వలె, నీతడును ఆంగ్లేయతా స్వభావమున కలవడి యుండెను. వారందరివలెనే తన జీవితవిధానములందు ఆంగ్లీకరింపబడిన వంగీయుడై యుండెను. కాని అనేకులవలెగాక అతని హృదయము, బాహ్యముగ ఆంగ్లపద్ధతులు, దుస్తులతో కప్పబడినను నిజముగ హైందవమే యైయుండెను. ఆంగ్లత్వము, హైందవ స్వభావమును వికృతమొనర్చును; వంశానుగతముగ పొందిన పరహిత నిష్ఠను నిర్మూలింపలేదేని కుంటుపరచి, ప్రతి హైందవుడును తనకుగల కుటుంబ, సంఘ బాధ్యతను త్రోసిపుచ్చ ప్రేరేపించును. ఆంగ్లోసాక్సనుని ప్రతిబింబమగు హైందవుడును తనకొరకును, భార్యకొరకును, పిల్లలకొరకు మాత్రమే జీవించును; తన దాతృత్వముపైన బంధువులకు హక్కుగలదని గుర్తించియు, తనకు బాధ్యతగలదని గుర్తించక వారికి సహాయము నొసంగుట కిష్టపడడు. కాని కృష్ణధనుడీ ఆంగ్లస్వభావమునందు వ్యతిరిక్తుడై యుండెను; అతడైరోపాజీవితవిధానముల ప్రవర్తించెనేని, హైందవుని సాంఘికబాధ్యతల నెప్పుడును త్యజించలేదు. ఆతనికోశ మెల్లపుడును బంధువుల వశమైయుండెను. ఆతడుద్యోగిగ నివసించుచుండిన పట్టణప్రజల కెల్లపుడును, నిజస్నేహితుడై, సన్నద్ధసహాయుండై యుండెను. బీదలయం దతనికిగల దయచే నతడొకొకప్పుడు వారికి సహాయముచేయుటకై తన సంతతి అవసరములను గోల్పోయెను. తనపుత్రుల కింగ్లాండునందు విద్యనొసంగెను: ఆంగ్లవిద్యకును, ఆంగ్లసభ్యతకును తానొసంగిన అతిగౌరవ కారణమున తన పుత్రులు స్వదేశమునందు ప్రారంభవిద్య పడయుటకుమునుపే వారి నింగ్లాండునకు పంపెను. కాని అతని దానధర్మము లెక్కువగుటంబట్టి, ఇంగ్లాండులోనున్న తన పుత్రుల వ్యయములకు తగినంత ధనమొకొకప్పుడు పంపలేకుండెను. ధనవంతుని కొమారులయ్యును, స్నేహితులులేని పరదేశమున, భౌతికముగను, నైతికముగను, బౌద్ధికముగనుకూడ ధనమేమూలమని యెంచబడుచున్న దేశమున, అతిబీదరికముగ వారు బ్రతుకవలసి యుండెను.

బుద్ధిసూక్ష్మత, హృదయమార్దవత, నిర్లక్ష్య స్వభావాత్మకమగు ధారాళత, ఆవేగత, స్వంతఅవసరములయందుదాసీనత, ఇతరుల కష్టములనుగురించిన సూక్ష్మపరిత ప్తత-యివి డాక్టరు కృష్ణధనఘోషుని స్వభావములు. ఆతని నిర్లక్ష్యతను ధనవంతులు దూషించిరి; ఆతని వ్యవహారజ్ఞతలేమిని ప్రాపంచికపురుషుడు నిందించెను; కాని ఆతని దృష్టియందివియే ఉత్తమోత్తమ గుణములు. ఆతని స్వార్థరహిత కారుణ్యమునకు, అతని ఆత్మపూరిత దాతృత్వమునకు, దరిద్రుడు, విధవరాలు, దిక్కులేని దీనుడు – వీరలుమాత్రమతనిని ప్రేమించిరి,

అకాలమృత్యు వతనిని గైకొన్నపుడు, అతని ప్రాంత్యమందలి ప్రతి బీద కుటుంబమునకు నిస్సహాయతస్థితి కలిగెను; అతనిసంతతియు దారిద్ర్యముం బొందెను. బంధువులును పరిసర బీదకుటుంబములును, తమ కనవరత మందుబాటులో నున్న ఉపకారవ్యక్తిని గోల్పోయి దుఃఖించిరి. శ్రీ అరవిందులకు తమ తండ్రినుంచి ప్రాప్తించిన గుణములివి, – త్వరితగత బౌద్ధికగ్రహణ, ఉదారసానుభూతి, నిస్స్వార్థము, స్వానుకూల్యతను దృష్టియందుంచుకొని పనిచేయవలసిన వ్యవహార కుశలతలేమి.

శ్రీ అరవిందులు బాల్యదశయం దింగ్లాండులో సామాన్య పాఠశాలయందు విద్య నేర్చుకొనెను. గతసంవత్సరమున శ్రీ అరవిందులను రాజకీయ నేరమునకు బ్రిటిషు ప్రభువులు విచారించినకాలములో వారిపేరును బ్రిటిషుప్రజలు పలుమారు చెప్పుకొను సందర్భమునందు శ్రీ అరవిందులు చదివియుండిన పాఠశాల ప్రధానోపాధ్యాయుడు తన పాఠశాలలో ముప్పదిసంవత్సరముల కాలమునందుకూడ శ్రీ అరవిందులవంటి బుద్ధి మేధగలవారిని తాను జూచియుండలేదని ప్రశంసించి యుండెను. ఈ పాఠశాలనుండి కేంబ్రిడ్జికి వెళ్ళి ఐరోపీయభాషల పాండితియందు గౌరవస్థానము పొంది ఇండియా సివిల్ సర్వీసు పరీక్షలో కీర్తికరముగ నుత్తీర్ణుడయ్యెను. గుఱ్ఱము సవారిపరీక్షకు పోకపోవుటచే నా సర్వీసుయందు చేర్చుకొనబడలేదు. ఇండియాకు వారు వెళ్లినంతనే బరోడారాజ్యమునందు కళాశాలలో ఉద్యోగము చేకూరెను. త్వరలోనే వారి గుణసంపత్తి ఫలితముగ రెండవ ప్రధానోపాధ్యాయులుగ స్థానమలంకరించిరి. ధనార్జనము, గౌరవము వారు కోరియుండిరేని బరోడాలో వారికట్టి అవకాశములు దండిగానుండెను. ఆదేశము మహారాజు శ్రీ అరవిందుల

చాలగౌరవించు చుండిరి; ఆరాజ్యమునందలి విద్యాధికులు కూడ వారిని చాల ప్రేమించు చుండిరి; ప్రజాసామాన్యము వారియందు గొప్పఆదరమును కలిగియుండెను. హిందూదేశమున ప్రధానరాజ్యమగు నీ బరోడాయందు, ఉన్నతపదవిపొందు ననేకావకాశములు వారికుండెను.

కాని దేశమున నూతనవికాసము కలిగెను. ప్రజల భావాదర్శములు, రాజకీయ, ఆర్థిక, విద్యావిషయములు పూర్ణముగా మార్పుచెంది, నూతనభావ దృక్పథముతో, నూతనోద్యమము ప్రారంభమగుచుండెను. ప్రార్థన, యాచన, అసమాధానపత్రముల నర్పించు భైక్షుకపద్ధతిని విడనాడి ఆత్మవిశ్వాసము, స్వసహాయముపై నాధారపడునుద్యమము దేశమున ప్రారంభమయ్యెను. తన స్వభావ స్వధర్మ జీవితమును సిద్ధింపజేసికొనుట కొరకు, అంతఃశక్తిని కనుగొని దానిపై నాధారపడుమని హైందవాత్మకు ప్రబోధ మొనరింప బడెను. ఈ పవిత్రోద్యమ సహాయమునకై కార్యకారులు, నాయకులు, కవులు, తత్వవేత్తలు, రాజనీతి విశారదులు, భవిష్యద్వక్తలు – వీరందరును ఆహ్వానింపబడిరి. ఆధునిక హిందూదేశమున పూర్ణత్యాగ మొనరింపగల ప్రతివ్యక్తియు, తన సర్వస్వమునర్పింప ప్రేరేపింపబడియెను. ఇప్పటివరకువలె విశ్రాంతిసమయమును, కూడపెట్టిన ద్రవ్యమును మాత్రమే కాక తమ సంపాదితము నంతయు, తమ సర్వకాలమును, దేశమునకర్పింప కోరబడిరి. ఈ పిలుపును, శ్రీఅరవిందుల హృదయ మందుకొనెను. వారిని వారి స్వంత రాజధాని ఆహ్వానించెను. ఆపిలుపు వారికి దారిద్ర్యదీక్ష నొసంగెను; మానవాభ్యుదయులయు, ప్రజారక్షకులయు భారము వారిపై నుంచెను. నిందాక్లేశ కారాగార బహిర్దేశవాసములును తత్ఫలితములై యుండెను. అయినను శ్రీ అరవిందులా పిలుపు నంగీకరించిరి; దాని కఠిననియమముల కొప్పుకొనిరి; సంతోషముతో నా పవిత్రభారమును గ్రహించిరి. కలకత్తాలో జాతీయవిద్యాసంఘము స్థాపించిన ఉన్నతవిద్యాశాలయందు ప్రధానోపాధ్యాయ పదవిని, నెలకు పదిసవరనుల చొప్పున నంగీకరించి, బరోడాసంస్థానమందలి సంవత్సరమునకు ఐదువందల అరువది సవరనుల ఉద్యోగమును త్యజించిరి.

ఇండియాగవర్నమెంటు వారాదేశమున విద్యానిలయములను తమకనుగుణ్యమగు రాజకీయ ఫలితముల నుద్దేశించి తీర్చుటయే, నూతన జాతీయ విద్యోద్యము

నకు గారణమయ్యెను. సర్కారువారి విద్యావిధానము ప్రజయందసంతృప్తిని వ్యాపింపజేసి యుండెను. అతృప్త బి. ఏ. ల సంఖ్య వృద్ధియయ్యెను. కర్జనుప్రభువుచే ప్రారంభింపబడిన నూతన విద్యావిధాన మీలోపమును మాత్రమే సవరింపజూచెను. కాని దానివుద్దేశ్యము రాజభక్తిగల పౌరులను, తమదేశమందలి అనియంత్రిత పరిపాలనమునకు తృప్తిపడి యుండగల పౌరులను, స్వారస్వాతంత్ర్యమును కోరని పౌరులను నిర్మించుటయైయుండెను. దీనికి ప్రతీకారముగ జాతీయవిద్యోద్యమము ప్రారంభింపబడెను. రాజకీయోద్యమము లందు పాల్గొనిన విద్యార్థులను సర్కారువారు శిక్షించుటచే, పై ఉద్యమము స్పష్టరూపమును ధరించెను. దాని ఆవశ్యకతకును ముఖ్యకారణములు వేరొండు యుండెను. గవర్నమెంటువారి విద్యానియమములను, వారి హితాహితు లుభయులును అసహ్యించుకొని యుండిరి. అవి మూలమునకు పోక ఉపరిగతమై యుండెను. ఆధునిక శిష్టతాభాయనొసంగుచు, మూలమును గుప్తపరచెను. భావరూపముల రెండింటియందును విదేశీయమగుటచే అది కృత్రిమమై యుండెను. విదేశభాషయందు ఉన్నతవిద్యాప్రాప్తి పొందవలసి యుండుటచే ఆ యున్నతవిద్య నేర్చుకొనుటకై విద్యార్థి శక్తినంతను ధారపోయవలసి యుండుటచే విద్యార్థి శక్తిని, కాలమును వ్యర్థముగ వ్యయపరుపవలసి యుండెను. విద్యార్థుల బౌద్ధికావసరములు అప్రధానములై విదేశరాజకీయ ప్రాముఖ్యతార్థమై, విదేశశాసనముచే అది నియమింపబడి యుండెను; జాతియొక్క ఆర్థిక, పారిశ్రామికావసరములు వెనుకకు త్రోయబడి, సాహిత్య ప్రధానమై యుండెను. ఈ విద్యావిధానము నరికట్ట నుద్దేశింపబడినదై జాతీయ విద్యోద్యమము ప్రారంభింపబడెను; జాతీయ నియమములచే, జాతీయ విధానములచే, శాస్త్ర, సారస్వత, అభ్యాసప్రపక (Technical) విద్యలను వృద్ధిపరుప ప్రతిపాదించెను. దీని ప్రారంభమునకు; జాతీయోద్యమమునందు పాల్గొన్న విద్యార్థులను గవర్నమెంటువారు తమపాఠశాలలయందు చేర్చుకొనరనుభయము, సహాయకరమైయున్నను, అది అధికారులతో స్పర్థ కవకాశమివ్వక, గవర్నమెంటునకు వ్యతిరేకముగగాక, గవర్నమెంటుతో సర్వసంబంధ రహితముగ పనిచేయ నుద్యమించెను. ప్రారంభమునకు కారణము రాజకీయమయ్యును, అధికారులతో విరోధములేని పద్ధతిని రాజకీయ స్పర్శ నెంతమాత్రము కలిగించుకొనకుండెను.

జాతీయవిద్యా సమాజమువారి యీ విధానమును శ్రీ అరవిందుల భావ సంప్రదాయము వారంగీకరించలేదు; అధికారుల భావములతో ఘర్షణ కలుగునను నీ అనవసర భయము వారికి రుచింపలేదు. కాని బహుసంఖ్యాకుల భావమును వీరామోదించవలసి యుండెను. ప్రజోద్యమములు సంఘమునందలి బలాఢ్యుల ధన ప్రోత్సాహములపై నాధారపడి యుండుట, ఆధునిక ప్రజాజీవన దుర దృష్టము. గొప్ప వ్యావస్థికోద్యమము లీకాలమున, ఆర్థికసహాయ మధికముగ లేనిది వర్ధిల్లవు. పూర్వపు ధనాఢ్యులవలె గాక ఆధునికులేసంస్థకుగాని తమ కధికారము నుంచుకొనక తమ సహాయ్యము నివ్వరు. ఈ అధికారము లేనిచో, ఉత్తమబౌద్ధిక, నైతికస్థితి యందుండగల సంస్థలు, యీ దురదృష్ట నిబంధనచే అవి వాని ఔన్నత్య మును గోల్పోవ్పట యగుచున్నది. జాతీయ జీవితము స్వతంత్రముగను, శక్తివంతము గనులేని సంఘము, ఉన్నత శిష్టతకు సహాయ మొసంగుటకు తక్కువ ప్రోత్సాహ మును, తక్కువ అవకాశములను కలిగియుండును; ధనాఢ్యుల ధనమందులకు సహ కారముగ నుండగల కాలబలము లేకుండును; ఇట్టిపరిస్థితులు పురాతన కాలము నుండి నెలకొనియుండు ప్రస్తుతకాలపు సంఘములకు చాల హానికరము.

హిందూదేశపు జాతీయవాదులు నిర్ధనులు; వీరి ప్రయత్నములచేతనే జాతీయ విద్యాసమాజ మారంభింపబడి యుండియు, ప్రారంభదశనుండియే, వారి ఆధీనము తప్పి అది పనిచేయుచుండెను; శ్రీఅరవిందులు జాతీయకళాశాల కధికార పదవిని కలిగియుండియు, తత్సమాజమువారి విరుద్ధభావములు, రీతులు, శ్రీఅరవిందుల పదవీనిర్వహణమున మొదటినుండియు, విరోధాభాసగ నుండెను.

ఒకానొక దృష్టిచే, నిది చాలదురదృష్టము. ఆంగ్లదేశమునందిప్పటి సంతతి వారు పొందగల ఉన్నతతమ ఆధునికవిద్యను, శ్రీఅరవిందులు పొందియుండిరి. బరోడాయందు యువకుల కుపాధ్యాయుడుగనుండి, సుప్రయోజ్యమగు ననుభవ మును పొందియుండిరి; తనదేశ జీవితపరిస్థితులను, అంతర స్వభావమును గ్రహించి యుండిరి; వారు ఆధునిక శిక్షణమునందలి ఉత్తమ విధానములను జయప్రదముగ జాతీయ విద్యావిధానమున కన్వయింపజేయ శక్యులై యుండిరి. వారు కలకత్తాకు విద్యాబోధకులుగ వచ్చిరి. ఉన్నతమగు జాతీయవిద్యను బునాదిగా చేసికొని జాతీయస్వాతంత్ర, ఔన్నత్యములు పెరుగవలసి యుండెనని వారికి తెలియును.

వారికి రాజకీయమైన ఆదర్శమొకటి యుండెననుట నిజమే; కాని రాజకీయము అను పదముచే సూచింపబడు అర్థముకన్న దానియందెక్కుడు విలువను వారు కలిగియుండిరి. వారి రాజకీయ సాంప్రదాయము కార్యసాధన కవసరమగు నాటక ముగ కాక మనుజగుణ సంబంధమై సంఘమునందు పనిచేసి జాతియందలి స్త్రీ పురుషుల పౌరుషమును బలపఱచి అభివృద్ధిచేయును. మతమును, నీతినుండి వేర్పఱుపకూడనట్లుగనే రాజకీయమునుండియు విద్యను వేర్పఱుపరాలరు. జీవిత వివిధ పరస్పర సంబంధములను వేర్పఱచు విద్యావిధానము ఆధునికముకాక మధ్యకాలీనము. అట్టిది కేవలము భావాత్మకమై జీవితమునందు సదాచరణ కుపయోగపడని సన్యాసులమతమునకు జెందినది. శ్రీ అరవిందులు ఆధునిక విద్యకు ఈశ్వర ప్రేషితుడు. ఐరోపాలో అంగీకరింపబడిన ఆధునిక విద్యావిధానమునకన్న వారి విద్యావిధానమున్నతము, పరమ ఆధ్యాత్మికాదర్శకము. మానవసంఘ బాహ్య జీవితమునందును, కార్యములందునుమానవాత్మయొక్క ఉన్నతతమ, గూఢతమ, ఈశ్వర చేతనను సిద్ధింపజేయుటయది. శ్రీ అరవిందులను కలకత్తాకు పోవుటకు ప్రేరేపించి నది, ఈ మహోన్నతాదర్శ విద్యావిధానమునకు కలకత్తాయందు సుక్షేత్రమొసంగ బడునను నాశయే. వారికి జాతీయకళాశాల విధానమందు పూర్ణ స్వేచ్ఛ యొసంగి యుండినచో, హిందూదేశమందును, ప్రపంచము నందునుగూడ ఆధునిక విద్యా విధానమందు నూతన అధ్యాయ మేర్పడియుండును. ఆధునిక శిష్టతయొక్క ఆధ్యాత్మ స్వభావ యాథార్థ్యమును, పురాతన బ్రహ్మజ్ఞాన ఆదర్శవాదపు అచ్చు లలో పోసిపనిచేయుటచే, అది హిందూదేశమున మానవసంఘ ఉపదేష్టియై వెలంగి ఆధునికనాగరకతను పాశ్చాత్యమిక లుబ్ధతచే నశింపకుండ కాపాడియుండును.

కాని, దురదృష్టవశాత్తు, వ్యక్తులుకాని, సంఘములుగాని తమ పూర్వ సంబంధ ఫలితములనుండి తప్పుకొనలేరు. ఆ నూతన జాతీయ విద్యాసమాజ సభ్యు లనేకులు, పూర్వ విశ్వవిద్యాలయముచే నిర్మింపబడినవారు. వారిలో కొందరు నాయకులనేక సంవత్సరములుగా గవర్నమెంటు విద్యావిధానమునందు సంబంధము కలిగి పనిచేసియుండిరి. అందులో మునిగి తేలిన వారికి నూతన విద్యావిధాన మర్థమగుట కష్టమైయుండెను. నూతన సూత్రము లభ్యాసమునందుంచి పరీక్షించు టకు వారు సమ్మతించిరికాని వానిని సత్యములుగా నంగీకరించి హృదయ పూర్వక

సహాయము నొసంగరైరి. అవేద్యములోనికి దూకుటవలె వారికదియుండెను. జాతీయవిధానములలో, జాతీయాధిపత్యము క్రింద జాతీయవిద్య నడుపవలెననుట సూత్రప్రాయముగా నంగీకరించి, అధికారుల సహాయము నాశించకూడదని కృత నిశ్చయులైయున్నను, అధికారుల విరోధము కలుగునను భయమునుండి విముక్తులుకాజాలక, అట్టిచో తమ కార్యక్రమము భంగమగునని తలపోయుచుండిరి. శాసనకర్తలభయమొకవంకను తమ ప్రజలందలి అవిశ్వాసము మరియొకవంకను వారిని పీడించెను. అందుచే వీరి విద్యావిధానము, గవర్నమెంటువారి విధానస్థానమున నూతన విధానమును నెలకొల్పుటకుబదులు దానిలో వీరి విధానమును లీనమయ్యెను. జాతీయసమాజకర్తల పిఱికి విధానము సంస్కరణకర్త విశాల భావములకు పీడాకరముగ నుండును. అందుచే, శ్రీ అరవిందులు కలకత్తాలో విద్యావిషయమున హృదయ పూర్తిగ ఆత్మతృప్తితో నడుపకష్టమయ్యెను. జాతీయ కళాశాలయందు వీరియున్నతపదవి, నూతన వ్యవస్థాపనకు ప్రారంభకుడుగానుండుటకు బదులు బరోడాలోని కళాశాలలోవలె భాషాబోధకుడుగ నుండవలసిన పరిస్థితి యేర్పడెను. కలకత్తాలోని నూతన కళాశాల, దేశాభిమానమునకు, సదుపయోగ కార్యక్రమమునకు విశాల క్షేత్రముగ నేర్పడునని వారు బరోడా విడిచి యుండిరి. ఆ ఆశ నిరాశయయ్యెను. కూలంకషమగు ఆధునిక జాతీయవిద్యావిధానమును నెలకొల్పుటకు హృదయ పూర్వకముగ నర్పింపబడిన తమ సేవను సమాజమువా రుపయోగించుకొన జాలకుండిరని ప్రారంభముననే వారు తెలిసికొనిరి.

పరిశుద్ధావేశముగల మనుజుడు జీవితమునందు తానుద్దేశించిన కార్యసిద్ధి కొఱకు తగిన పరిస్థితులను, ఇతరులు సిద్ధపఱచియుంచరేని, తానే సిద్ధపఱచుకొనును. ప్రజోపయోగముకొఱకు, విశాలతర క్షేత్రములు శ్రీ అరవిందులకు త్వరలోనేర్పడెను. జాతీయ సంఘమునకు ఆంగ్లభాషయందు దినపత్రికొక్కటియు లేకుండెను. నూతనముగ నొకటి స్థాపింపబడెను. శ్రీ అరవిందులు ప్రకాశకులుగ పనిచేయకోఱబడిరి. ప్రచురణసంఘమేర్పడి అందులో వీరునొక వ్యవస్థాపకులుగ నేర్పడిరి. దేశమునందు వార్తాపత్రిక ప్రచురణ నిపుణతయందు వీరు స్థాపించిన "వందేమాతరం" ప్రారంభమునుండి అగ్రస్థానము వహించెను. ఆరంభము నుండియు పారంగతుని ప్రావీణ్యత ఆ పత్రిక నిర్వహణయందు చూపట్టెను. ధీర

వృత్తి దృఢచింతన స్పష్టభావము పరిశుద్ధశక్తియుత లేఖనశైలి, తీక్ష్ణకుతర్కనము, విశుద్ధహాస్యరసము, నగునీగుణములు, ఆ పత్రికయం దన్నిటియందుకన్న మిక్కుటము. ప్రతి వంగదేశ పత్రికయు, ఈ పత్రిక ధోరణినవలంబించిరి. విరుద్ధ ఆంగ్ల పత్రికాసంపాదకులును నీ పత్రికను మెచ్చుకొనిరి. కలకత్తాయందేకాక, దేశమం దంతటను, ప్రతిదినసమస్యలపై అది తెలుపు విషయములకొఱకు ప్రతిదిన ఉదయము ఈ పత్రికకొఱకెదురు చూచుచుండిరి. ఇంగ్లాండు దేశ పత్రికలుకూడ, ఈ పత్రికను తమ గమనమునం దుంచుకొనవలసియుండెను. ఈపత్రికనుండి విషయముల, లండను పత్రిక "టైమ్సు" నందు వారవారము ప్రతిముద్రణ మొనర్చుచుండిరి. దాని నసహ్యించుకొన్నను భయపడినను, ప్రతివారును దానిని నిర్లక్ష్యము మాత్రము చేయజాలని పలుకుబడిని సంపాదించెను. ఈ నూతన పత్రికకు శ్రీ అరవిందులుప్రధాన నాయకులు. జాతీయ కళాశాలయందు కలుగని అవకాశములు "వందేమాతరం" పత్రికయందు వారికి కలిగెను. కొద్ది యువకుల ప్రబోధకునికి బదులుసర్వదేశమున కుపదేశకుడయ్యెను.

—బిపిన్ చంద్రపాల్

అనువాదకుడు : సి. నారాయణరెడ్డి

# జగన్మాత

ఈ సృష్టిస్థితి లయములకు కారణభూతుడును పరాత్పరుడును నగు జగదీశ్వరుని, వివిధ జాతులవారు వివిధ నామరూపములతో నారాధించినవారు, మరియు నారాధించు చున్నవారు. అతడు ఆరాధించువారిభావముల కనుగుణముగా ఆయా నామరూపములతో దర్శనమిచ్చిన దృష్టాంతములు విపులముగా నున్నవి. కాని జగదీశ్వరుని జగన్మాతృరూపమున ఆరాధించుటనుగూర్చి ఇక్కడ సంక్షేపముగా నుల్లేఖించుట యవసరము. హిందూధర్మమందు ప్రాముఖ్యముగా జగదీశ్వరుని మూడు ప్రకటస్వరూపములను బ్రహ్మ విష్ణు రుద్రులనెడి నామరూపములతో పూజించువారు. బ్రహ్మను జగత్ స్రష్టయగుట, విష్ణువును జగత్ రక్షకుడగుట, రుద్రుని లోకసంహారకుడగుట సర్వశ్రుతమైన విషయమేకదా. ఇదేరీతిగా జగదీశ్వరుడు ఉపాసకుల భక్తిభావముల ననుసరించి, అనేకరీతుల అనేకనామరూపములతో ప్రకటితుడగుచున్నాడు.

వేదోపనిషత్తులు జగదీశ్వరుని అవ్యక్తునిగను, అనిర్వాచనీయునిగను వర్ణించు చున్నవి. అల్లై మహమ్మదీయులాతనిని రూపరహితుడనియు, అఖిలబ్రహ్మాండముల యొరయుడనియు నంగీకరించి, యెదనిండిన భక్తితో ప్రార్థించువారు. క్రీస్తులు దయానుయుక్తైన దేవుని సర్వలోకముల పరమపిత యనినమ్మి, యాభావమున పూజించువారు. హిందూ తాంత్రిక సంప్రదాయములవారు జగదీశ్వరుని, ముఖ్యముగా, మహాశక్తిరూపమున, మహామాతగా పూజించువారు. కాని వారు కేవలము శక్తియొక్క, లేక ప్రకృతియొక్క దాసులవలె పురుషుని నిరాకరించిన మాట పూర్ణతా దృష్టితో కడుగొప్ప కొఱతయనియే చెప్పవలెను. ఇదేరీతిగా వేదాంతులు పురుషునే స్వీకరించి ప్రకృతిని ఉపేక్షచేసి యున్నారు. ఇదికూడనంతే; ప్రమాణము యొక్క న్యూనతయే యగును. ఈ రెండుపంథలు సత్యముయొక్క కొంతభాగ

మును మాత్రమే స్వీకరించినవి. కాని పూర్ణదశలో ఈ రెంటిని స్వీకరింపవలసి యుండును. పురుషుని విడిచి ప్రకృతి కాని, ప్రకృతిని విడిచి పురుషుడుగాని లేనే లేదనుటకు శివుడు శక్తితో నొడగూడి అర్ధనారీశ్వరుడగుట మిక్కిలి సాక్షీభూతమై యున్నది.

ఇంకను జగదీశ్వరి యొక్క అథవా జగన్మాతయొక్క యుపాసనాఫల పరిణామములను విచారించుటకు మునుపు, ఇంటి తల్లిదండ్రుల ప్రేమ వాత్సల్యముల గమనింతుము. ఏలన ఈమాట జగత్తుయొక్క మాతా పితలయిన జగదీశ్వరికిని జగదీశ్వరునకును అన్వయించు చున్నది. బిడ్డలు తమతప్పులను తండ్రిముందఱగాని, ఇంకెవరి ముందైనను చెప్పలేరు. కాని తల్లిముందఱ మాత్రము తమ హృదయమును విచ్చి చెప్పుదురు. స్నేహమయియైన తల్లికూడ దయార్ద్రహృదయముతో బిడ్డలయేదోషములను గణింపక, అంతయు క్షమించి, తండ్రియనుమతిచేత యోగ్యదశకు సాగుటకు పూర్ణ సహాయమును నిచ్చుననుసంగతి ప్రతియొక్కరి అనుభవమునకు వచ్చిన చాలును.

జగన్మాతకూడ జగత్పితయొక్క అనుమతివలన జగచ్చాలన పూర్ణ భారమునుమోసి దానిక్రమ ప్రగతిని గూర్చి అత్యంత దక్షతచేత కర్మకారిణి యగుచున్నది. ఈ జగన్మాతయనగా వేరె యేమియుగాక జగదీశ్వరుని యొకయంగమైన కృపాశక్తియే ఘనీభూతమై వచ్చినయతని మహాప్రతినిధియై యున్నది. కావున జగదీశ్వరుని, జగదీశ్వరి, లేక జగన్మాతయొక్క రూపమున ఆరాధించుట యథార్థము సత్యమును అయినది గదా. జగన్మాతయొక్క పరమకృపచేత పూర్ణయోగ సిద్ధి లభించుననుటకు శ్రీఅరవిందులు తమ (Mother) 'మాత' యనుగ్రంథముయొక్క ప్రథమ భూమికలో నిట్లు నుడువువారు.

"సాధకుని యాంతరిక ఆకాంక్ష పైకిబోవలసియున్నది. మఱియు పైనుండి మాతయగు భగవతియొక్కకృపయు నవతరింప వలయును." భగవతి కృపను, లేక భగవత్సాక్షాత్కారమును పడయుటకు రెండు మార్గములున్నవి. ఒకటి తపస్సు, ఇంకొకటి సమర్పణము. తపస్సుయొక్క మార్గము అతికఠినమైనది. ఈ మార్గమున నెల్లరు కొనముట్ట జాలరని బహుజను లొప్పుకొనువారు. రెండవదియగు సమర్పణ మార్గమును సాగించుటలోనె మనకళ్యాణ మున్నది. ఏలన, మనమేశక్తికి అర్పితుల

మగుదుమొ. ఆశక్తియె మనయోగక్షేమముల భారమును వహించి సదా కార్యకారి యగుచున్నది. అందువలన ఈ చరాచర జగత్తునకు సూత్రధారిణియగు ఆదిశక్తికి మనలను మనముపూర్ణముగా నర్పించుకొన్నచో మనదని చెప్పబడునదంతయు సర్వతోముఖమైన సుఖ సమృద్ధులతో నిండి తొనకుట యందాశ్చర్య మేమున్నది?

కావున రండి! రండి!! పూర్ణయోగ సాధకులారా! రండి!! పరాప్రకృతి సంతానమైన మనమెల్లరము సకల సహాయకులును, జగత్పాలకు రాలును నగు జగన్మాతయొక్క శ్రీచరణములందు మనసమగ్ర జీవనమును నొకసుమంబు వోలె సమర్పించుదము గాక!

ఆదమ సాహేబు
శ్రీఅరవిదాశ్రమం.

జయ భగవతి!!

# వందనము! *

వందనమమ్మా!
వందనము!
కిణు కిణు కిణు కిణు
కృపణ నరావళి
శిరసులపై నీ
ఖర కరవాలము
కహ కహ కహ కహ
మహా భయంకర
ప్రళయోదధి ప్రో
త్తాల తరంగము
నీ కటు హాసము

గుభుల్లుభుల్లిన
దభాక్కటీ రవి
లుంఠన కీకస
మాలా జ్వలితము
త్వదీయ రూపము
మధుర వసంతో
న్మద పిక గానవి
కాసము నీ మృదు
పద విన్యాసము

వందనము!

ఘలం ఘలిత ల
 క్ష్మీ లాలిత్య వి
లాసము నీ శో
 భామయ హాసము
అమర కాలకీ
 ర్త్యంకుర శబ్ద
బ్రహ్మము తావక
 లలిత కటాక్షము
ప్రథమోషః కా
 లానర్తిత ఋషి
హృదయము – మోదా
 వధి నీ రూపము

రటదుత్కట రూపిణి
 కాళీమయి!
నటదూర్మి మనోహారి
 లక్ష్మీమయి!
నవనాద సుగంధిల
 ఓ వాఙ్మయి!
వందన మమ్మా!
 వందనము!

* జగన్మాతను తలచుకొన్నపుడు స్ఫురించినవి.

# కళయనగనేమి?

బొగ్గునకును, వజ్రమునకును వస్తుతత్త్వమునం దెట్టి భేదము లేకున్నను, ఒకటి నల్లనై, మన్నమై, తేలికయై, యెందు జూచిన గన్పట్టునదై యుండగా, మఱియొకటి దేదీప్యమానమై, కఠినమై, బరువై, మిక్కిలి యపురూపముగా గనబడునదై యుండును. ఏకపదార్థ మనుజలము ద్రవపదార్థమగు వర్షముగను, ఘనపదార్థమగు వర్షోపలముగను, వాయుపదార్థమగు నావిరిగను గోచరమగుచుండును. కమలము పేడవలె పృథ్వ్యాది పంచభూతములతో నేర్పడినదైనను, దానిరూపము, రంగు, దళములపొందిక, పరిమళము మన కానందము నిచ్చును. ఏల? పదార్థమునందలి యణువుల సంయోగము ఏకరీతిగా నుండక పలువిధములుగా నుండును. ఏవస్తువు లయం దణుసంయోగము లయాన్వితమై (Rhythmic) యుండునో, యవి తేజోవంతములై, జీవకళగలవియై యుండును.

బొగ్గు, వర్షము, పేడ- ఇవి వజ్రమునకంటెను, వర్షోపలమునకంటెను కమలమునకంటెను మిక్కిలి యుపయుక్తములై యున్నను, మనము మొదటివానినంతగా బ్రేమింపక రెండవవానినే ప్రేమింతుము. బుద్ధుని దంతమువలన భౌద్ధుల కెట్టియుపయోగము లేకున్నను, దానికై వారాలయమును గట్టించి దానినొకదివ్యవస్తువుగాం బూజించువారు. వంశపారంపర్యముగా బ్రాప్తమైన యొకయలతివస్తువును మనమెంతో ప్రేమించి, దానినిభద్రముగా మన పుత్రపౌత్ర ప్రపౌత్రాదులకొరకు గొప్పయాస్తిగ వదలుచున్నాము. ఈ సంగతులంబట్టిచూడ, వస్తువులు తమ కేవల ప్రయోజనముంబట్టికాక, అవితమసహజ రామణీయకముం బట్టియు, తమ విభూతింబట్టియు, మనయందవిపుట్టించు భావ సాహచర్యముం బట్టియు, భావనాప్రేరణం బట్టియు వానికయి మనముచేయు చింతనంబట్టియు- అనగా వానివలన మనలోనేర్పడు లయ సామంజస్యముం బట్టి (Rhythmic Harmony) మనకు బ్రియము లగుచుండును,

తీర్థక్షేత్రాదులను దర్శించునప్పుడు మనమనంబు హర్షప్లావిత మగుచుండును. వానియందుండు నొకదివ్యశక్తియె యందులకు గారణమైయుండును. ఈ శక్తి వాని యందలి నిసర్గ రామణీయకమును బట్టి కలిగినదై యుండవచ్చును, లేదా మహాత్ములు వానిపై బఱపిన భక్తిభావములం బట్టియు, సదాలోచనలం బట్టియు బొడమినదై యుండవచ్చును. మహాత్ముల తలపులు మహాశక్తిమంతములై యుండును. వాని వెదచల్లిన మహాపురుషులు దవ్వులనున్నను, దేహము విడచియున్నను వారి తలపులు లయసామంజస్యము గలవి యగుటచే సజీవములై యుండి యెంతో పని చేయుచుండును. రామాయణ మహాభారత కావ్యములు మహర్షులగు వాల్మీకి వ్యాసులచే రచింపబడినవి గావుననే యందలిభావములు మహాశక్తి సమన్వితములై, లయ సామంజస్యము గలవియై, మహాప్రభావ వ్యాపకములై యున్నవి. ఆకావ్యములు నాటికిని నేటికిని రేపటికిని లోకమునందు వెలసి, లోకమును బవిత్రవంతముగా జేయుచుండెడివి.

దేశచరిత్రను జదివినవారికి బొంబయి నగర దర్శనముకంటెను తుంగభద్రాతీరమందలి పాడ్వడిన విజయనగర (హంపీ) దర్శనమె యెక్కువసొంపు గూర్చునదిగా నుండును. విజయనగర సామ్రాజ్యముయొక్క పూర్వౌన్నత్యము స్మృతిపథమున దోచి వారిమనంబును లయాన్వితం బొనర్చును. తిరుపతి కొండమీది వెంకటేశ్వర విగ్రహమును, అందలి శిల్ప సౌందర్యమునుబట్టి హిందువు లారాధించుట లేదు; కాశి యందలి విశ్వేశ్వరుడును లింగమూర్తియేకదా; ఆ విగ్రహము లందు నొకదివ్యశక్తి యున్నదని విశ్వసించుటచే, వారి హృదయములు భక్తిభావ యుక్తములై లయాన్వితములు కాగ వారు వానిని నర్చించుచుందురు. ఒథెల్లో నాటకములో బ్రారంభమున భార్యా భర్తలు సరాగులై యుందురు. తుదకు భర్త తన భార్యనుజంపి, తానును నాత్మహత్య చేసికొనును. ఈ నాటకము విషాదాంతమైనను, దిదృక్షువుల కానంద మొసగుటేల? అందలి నాయకా నాయకుల జీవిత ప్రవృత్తి లయాన్వితమై యున్నది గావుననే. ఒకత్రాగుబోతు తనభార్యను జంపుచో మన మయ్యోయందుముగాని, యందునాటకీయ రసముప్పతిల్లదు. అది యొకశోక వార్త మాత్రమయి, కళారచనగా గూర్పబడక పోవుటచేత రసోత్పత్తికందవకాశము లేదు; అందు లయ యేర్పడదు. కాని జీర్ణవిజయనగర దర్శనము వలనను,

తిరుపతి వెంకటేశ్వర కాశీవిశ్వేశ్వర విగ్రహ దర్శనములనను, అంతశ్చైతన్యమందు లయ యుత్పన్నమయి యానందము గల్గుచుండును. ఈనిదర్శనములంబట్టి విచారింప, లయ బాహ్యవస్తు నిష్ఠమయ్యు, వ్యక్తి మనోనిష్ఠమయ్యు యుండునని స్పష్టమగు చున్నది.

లయ యనగనేమో యించుక విచారింతము. "వస్తువిషయములందు నియమబద్ధముగా నుత్పన్నమైన సామరస్యపు సంచలనమె లయ. ఇది శిల్పుల చేతి యందు గల సృజనశక్తి" * యని శ్రీరవీంద్రుడు నుడువు చున్నాడు. జగచ్ఛిల్పి యగు నీశ్వరునందు బోలె సామాన్య శిల్పి యగు మానవుని యందును నీ శక్తి యుండును. ఈ శక్తిచేత నీశ్వరుడు పుష్పమును, బ్రంహ్మాండమును సృష్టించునట్లు, మనుష్యుడు చిత్తరుబొమ్మను, మహాకావ్యమును సృష్టించు చున్నాడు. పుష్పము వలనను, బ్రహ్మాండమువలనను నీశ్వరుని యనంతక్రియాశక్తి వ్యక్తమగుచుండునట్లు, కవిస్రష్ట తనరచనల వలన సుందరవస్తు ప్రదర్శనముగావించి, మానవజీవిత తత్త్వార్థముల నెఱుకపఱచి, జీవాత్మ విశ్వాత్మలకు గల సంబంధమును వెల్లడించి సత్య సౌందర్యానందముల జేకూర్చును.

విశ్వసృష్టి యంతయు భగవంతుని గావ్యమేకదా. ఈశ్వరసృష్టి స్వతంత్ర మైనట్లు, శిల్పియొక్క కళాసృష్టియు స్వతంత్రమే యగునుగాని, కేవల మనుకరణ మగుటలేదు. ఉత్తమమైనకళ సంపూర్ణమైన లయ సామంజస్యముం బడసియుండును. రేఖావర్ణ సామంజస్యము గల చిత్తరువు, దీపకళికవలె నక్షత్రమువలె నిలుకడగా నుండునట్లు గాన్పించినను, దానియందు సంచలన సామంజస్యమమరియుండుట వలన, అది సజీవమై- యనగా జీవకళగలదియై యుండును. తత్సామంజస్యము లేని చిత్తరువు జీవసంచలనము లేనిదై యుండును. మానవుని యుచ్ఛ్వాస నిశ్వాసములు, వాని హృదయస్పందము, వాని తలపులు మున్నగునవి లయ సామరస్యము గలిగియుండుటచేతనే యతడు ప్రాణవంతుడై, తేజోవంతుడై యుండుట. ఈ నిదర్శనములం బట్టిచూడ లయ సామరస్యము సకల సృష్టికి దేజమును, జీవమును, క్రియాప్రవృత్తిని, ఉత్తమత్వమును నిచ్చునదై యుండుననుట తెల్లము.

---

* Rhythm is a movement generated and regulated by the harmonious restriction. This is the creative force in the hand of the artist." Tagore.

సమగ్రమైన లయ సామరస్యము పరుసవేది వంటిది. అది స్పృశించు ప్రతి వస్తువునకును నుత్త్వమత్త్వ మొసంగి దానికి, తేజస్సాసంగును; మఱి యావస్తువునకును, చూపఱయాత్మకును అనుసంధాన మొడగూర్చును. ఇట్టి లయ సామంజస్యముంబొంది, శక్తిగలిగి, పరిణతిగాంచిన రచనయే కళ. ఇట్టి కళ సత్యమైనది, సుందరమైనది, ఆనందమును విస్తరింప జేయునది. ఈ యానంద మొక సంవిద్విశేషము. ఇది ప్రతిజీవి యందును బీజావస్థ యందుండును. "కళ బీజావస్థ యందుండు నానందమును బ్రచురమైన యనుభవావస్థకు దెచ్చి చర్వ్యమాణ మొనర్పజాలును." నిజముగా గళ రచయితయొక్క యాత్మ సంస్కారమును నివేదించు నొకరచనా విశేషము. ఈ రచనా విశేషమువలన దలపులు సహితము సజీవములై యుత్తమాకృతిబొంది సాక్షాత్కృతము లగుచుండును.

కళలను ఫలితకళలనియు, లలితకళలనియు రెండువర్గములు చేయవచ్చును. ఐహిక వ్యవహారములకు, ఐహిక సుఖమునకు నుపయోగపడునవి ఫలిత కళలు (Useful arts) ; ఐహికాముష్మిక సుఖదాయకములు లలితకళలు (Fine arts); ఈ వ్యాసములందు ఫలితకళల గుఱించికాక, లలితకళల గుఱించియే నుడివెదము. కావున గళలన్న లలితకళలనియే తెలియవలెను. కవితారచనము, చిత్రలేఖనము, చిత్రరంజనము (Painting) ,గానము, నృత్యము, ప్రతిమారచనము (Sculpture), వాస్తునిర్మాణము (Architecture), ఇవియె ప్రధాన లలితకళలు.

# శరీర సిద్ధి

శారీరిక సిద్ధిని, మనకందుబాటులో నున్నంతవరకు సంపాదించుట, శారీరిక శిక్షణ యొక్క అంతిమ యుద్దేశ్యము. సమస్త కృషి ఆధ్యాత్మిక, చైత్యిక, మానసిక, ప్రాణిక సత్తలన్నింటి యొక్కయు, ఉద్దేశ్యము పరిపూర్ణతనొందుటయే యగును. శారీరిక కృషి యుద్దేశ్యముకూడనంతే. మన ప్రయత్నము, వ్యక్తగత సత్తనంతటిని పరిపూర్ణమొనర్చుట నయ్యేనేని, అందులోని భాగమగు శరీరమును త్రోసివుచ్చజాలము; ఏలన శరీరము మనకు భౌతికబునాది. అది మనముపయోగించుకొనవలసిన పరికరము. "శరీరము ఖలు ధర్మసాధన" మని సంస్కృతమున నొక సామెత గలదు; ధర్మమునకు సాధనము శరీరము. మనము స్వకీయముగ ప్రతిపాదించుకొను ప్రతియాదర్శము, దానిని నెరవేర్చుట కవలంబించు నియమములను కార్యములను గలిగియుండును; వానినే మనము ధర్మమందుము. సమగ్ర పరిపూర్ణత మన గమ్యస్థానము; ఏలన, మన ఆదర్శము, మనము వసించుచుండీ పృథ్వియందు మనము సృష్టించగల దివ్య జీవితమై, ఈశ్వర సామ్రాజ్యమై, జడలోక పరిస్థితులననుసరించుకొని యుండు నీభూమియందలి జీవితమునాధ్యాత్మికముగ రూపాంతరమొందించుటయై యున్నది. శరీరముకూడ రూపాంతర మందదేని, దాని కార్యాచరణములు సాధ్యమైనంతవరకు పూర్ణసిద్ధిని శక్తిని బడయవేని, దివ్యజీవితమంతవరకు కొఱవడును.

ఈ ఆశ్రమమునందు ప్రత్యేక శ్రద్ధ వహించి, పొందనవకాశములతో ప్రారంభింపబడిన శరీరవ్యాయామములయు, సాధనలయు ఫలితము, శరీరమునందు సహజ సామర్థ్యముల మేల్కొలిపి అభివృద్ధిపఱచుట మాత్రమేకాక, శరీరమునంటియున్న భౌతిక ప్రాణిక మానసిక చేతనలకు కూడ సాధ్యమైనంతవరకు సిద్ధిని సమకూర్చుట యని నేను పూర్వసందేశమునందు వివరించియుంటిని. భౌతికశరీరచేతనను

అభివృద్ధిపొందించుట మనయుద్దేశ్యము నందలి ముఖ్యాంశము; అందులకు శారీరిక సక్రమాభివృద్ధికూడ ముఖ్యావసరము; ఆరోగ్యము, బలము, ఔచిత్యము ప్రథమావసరములు; కాని స్థూలకాయమును కూడ అత్యుత్తమ స్థితికి తేవలయును. భౌతిక ప్రపంచమున దివ్యజీవితమనుటచే, విశ్వపుటునికియొక్క రెండుచివరలనదగు భౌతికాధారమును, ఆధ్యాత్మిక శిఖరమును నొండొంటితో జేర్చవలయును. ఆత్మావిష్కృతికి ముఖ్యమగు ప్రాణమును భూమియందు స్థిరపఱచి, చైతన్యపుటుచ్ఛ్రియములకు నది (ఆత్మ) ఆరోహించి, దిగువనున్న నాధారమును త్రోసిపుచ్చక యీ ఊర్ధ్వ అధోభాగముల రెండింటిని కలుపును. చైతన్యము (Spirit) జడములోనికిని జడప్రపంచములోనికిని తన శక్తిజ్యోతితేజస్సులతో నవతరించి, జీవితమునునింపి, అధికాధికముగ దివ్యత్వమునకు రూపాంతరమొనరించును. జడశరీరమీవిధమున నేదో యొక విశుద్ధ సూక్ష్మఆధ్యాత్మిక స్థితికి మారుట జడమునకు స్వాభావికముగ నయిష్టముగనుండును; చైతన్యము శరీరమునందు శృంఖలాబద్ధమైనట్లుగనో, లేక శరీరము దాని కంతరాయముగ నుండునట్లుగనో తలంచును; కాని ఈ మార్పు ఉపరిగతముకాక రూపాంతరమును పొందించునట్టిది యగుటచే జడస్వరూపమును చైతన్యము దానిస్వస్వరూపముగా గ్రహించి దైవత్వమును ప్రదర్శించు పరికరముగా మార్చును; జడశరీరము యొక్క శక్తులను సాధ్యతలను విధానములను నది త్రోసిపుచ్చదు; మరుగుపడిన సంభావ్యతలను బహిర్గతమొనర్చి, ఉచ్చస్థితులకు తీసికొనిపోయి, పూర్ణత్వమొసంగును. అజ్ఞానముననుండి, జ్ఞానమునకు పెనగులాడు మనస్సు, సత్యజ్యోతిస్వరూపమగు అతిమానసము (Supermind) నకుద్గమించి, దానిని క్రిందికి గొనివచ్చి, మన అంతర దృష్టిని, చింతనను, గ్రాహ్యశక్తిని, మరితరజ్ఞాన సాధనల నన్నింటిని తమ బాహ్యాంభంతర ప్రవృత్తులందు సత్యప్రకాశములతో వెలుగునట్లు చేయవలెను. అట్లే, ఇంకను, నిమ్నతర తామస భావము, అస్పష్టత, అస్తవ్యస్తతలతో కూడుకొన్న మన ప్రాణప్రవృత్తిని — దాని ఆవేశములు ప్రేరణలు యున్నతములుగ ప్రకాశవంతములుగ నొనచి — మన ప్రాణమునకు ప్రతిరూపముగ అతిమానసచేతనమునందుండు అతిప్రాణము (Super-life) నకు గొంపోవలెను. మనభౌతికశరీరమును శరీరచేతనను వాని కార్యమునందును స్థితియందును, మనమూహించజాలనంతటి యవస్థితికి, పరిపూర్ణతకు

గొనిపోవలెను. అంత్యమున అతీతమునుండి వెలువడు సౌందర్యానందజ్యోతులతో దానిని పూరించవలెను. భాగవతజీవితము తన దివ్య శరీరమును అదియే ఆకారించు (నిర్మించు) కొనవలెను.

కానిమొదలు, పరిణామప్రకృతి యొకానొక ఉన్నతస్థితిని చేరినతర్వాత మాత్రమే అది స్వయముగా చైతన్యమును అందుకొను శక్తియు, ఆధ్యాత్మిక మార్పునొందు నాకాంక్షయు కలిగి, తనను రూపాంతరమొనర్చు దివ్యశక్తికి అది యున్మీలనముకావలెను. జీవితానందముకొఱకు ప్రాణసత్తను, ప్రస్తుత సంకుచిత స్థితి నుండి స్వయంనిర్వాహక శక్తిగల స్థితికి గొనిపోయి శక్తివంతమొనర్చి యాప్రాణ శక్తుల నన్నింటిని యుక్తముగ నుపయోగించుటకుగా ప్రాణసత్తను యుక్తపరికర ముగనొనర్చి నిమ్నతర మనోప్రాణముల స్వభావమును రూపాంతర మొందించుట చేతనే పూర్ణముపరమమునగుసిద్ధి సాధ్యమగును. అట్లే, శరీరము, ప్రస్తుతమదిమానవ ప్రయత్నముచే పొందగల నత్యున్నత స్థానమును పొందియుండియు, దానినావరించిన ప్రతిబంధకములనుండియు దానిని దాటించి, దాని శక్తుల, క్రియల, చేష్టల నన్నిటియందును, దానిని రూపాంతర మొందించవలెను. మనము పొందగల కృత్స్న మార్పునందు మానవశక్తులను సాధనములను త్యజించక వానిని గ్రహించి, నూతన జీవితమునందు పొందగలనత్యంత సంభవనీయతకుగానుపయోగించి విస్తృ తింపవలెను. ప్రస్తుతము, మానవుని ప్రాణికమానసిక శక్తుల నావిధముగ పృథ్వి యందు దివ్యజీవితమునకుగా, ఔన్నత్యమును పొందించవచ్చునని యూహించుటంత కష్టముకాదు; కాని ఆ శరీరసిద్ధి యేరూపమున నేవిధమున నుండవలసినది మనము భావించవలెను.

పూర్వ ఆధ్యాత్మికాన్వేషకులు, శరీరమును, ఆధ్యాత్మిక సిద్ధిని పొందగల పరికరముగను, ఆధ్యాత్మికమార్పునకు క్షేత్రముగను గాక దానినొక అంత రాయముగను, అతిక్రమించబడి త్యజింప బడవలసిన యొక పరవస్తువుగను దలంచిరి. శరీరము జడవస్తువు యొక్క స్థూలత్వమనియు, జయింపరాని అంతరాయమనియు తలంచి దానిని నిర్లక్ష్యముచేసిరి. దానిని రూపాంతరము పొందింప నసాధ్యములగు పరిమితులకు అది లోబడియున్నదని వారుతలంచిరి. అదెందుకన, మానవశరీరము దాని పరమోన్నతియందుకూడ, పరిమితిగల ప్రాణ

శక్తిచేనడిపింపబడుచు, దానిఅల్పతర భౌతికక్రియలయందది క్షుద్రము స్థూలము నింద్యమునైన న్యూనమొనరింపబడి యున్నది; మరియు శరీరము స్వకీయముగ, జడవస్తుగుణములగు నిశ్చేతనమునకు తామసమునకులోనైన, శరీరమందలి నాడీ మండలి శక్తిచే కొంతవఱకు మాత్రమే జీవశక్తి కలిగిన దయ్యును, శరీరము నందలి జీవకణములు ప్రాణధాతువులు తమ గూఢక్రియా స్వభావమందు అర్ధ జాగృతి కలవైయుండును. దాని అత్యున్నత శక్తి సామర్థ్యముల యందును, దాని తేజస్వంతమగు సౌందర్యమునందును గూడ, అది భౌతిక నిశ్చేతనము యొక్క వికసిత ప్రసూనముమాత్రమే; అదినిశ్చేతన మనదగు మంటినుండి పుట్టిపెరిగిన దగుటచే, అనునిమిషము దానిహద్దుల నధిగమించిపోవుటకది వాని నెదుర్కొనుచుండును. కాని దివ్యజీవనమే పృథ్వియందు సాధ్యమగునేని, ఈస్వాతిక్రమణమును సాధ్యముకావలెను.

సిద్ధిప్రాప్తికొఱకు, మనయునికికి గల ఆధ్యాత్మికము భౌతికము అను రెండు అంత్యములలో నేదేనియొక అంత్యమునుండి మనమాకార్యమును ప్రారంభింప వచ్చును. అట్టిచో మనము ప్రారంభించిన అంత్యమునకు అనుగుణ్యమగు పద్ధతులు ప్రక్రియలు మనమవలంబించవలెను. యోగమునందీ ప్రక్రియ ఆధ్యాత్మిక-చైత్యక స్వభావమైయుండును; ప్రాణిక శారీరక ప్రక్రియలుగూడ ఆధ్యాత్మిక-చైత్యక వైలక్షణ్యమును గలిగి, హఠయోగ రాజయోగములందలి ప్రాణాయామము ఆసనములచేవలె, అవి (ఆప్రక్రియలు) సాధారణప్రాణిక భౌతిక ప్రేరణలకన్న నున్నతప్రేరణను కలిగియుండును. ఆధ్యాత్మికశక్తిని ఉపలబ్ధిపొందుట కను, చైత్యిక శక్తులకు జీవితవిధానములవ్యవస్థిత మొనర్చుకొనుటకుగా,తత్పూర్వము శరీరప్రాణమనస్సుల కవసరమగు క్రమశిక్షణ అవసరమై (రాజయోగమునందలి యమనియమములవలె) యుండును. కాని ఈశిక్షణయు ఆయాయోగమునకు తగిన విధానముననుసరించి యుండును. ఈ యోగవిధానములచే గాక, భౌతికాంతము నుండి ప్రారంభించితిమేని జడప్రాణ తత్వములు మనకొసంగు ప్రక్రియలను, విధానముల నవలంబించి జడశక్తి ప్రాణశక్తి కనుగుణ్యమగు శిక్షణవిధానము ననుసరించవలెను. అట్టికార్యకలాపముచే పొందునెఱవేఱిక, సిద్ధి, సాధారణ సంభావ్యతకన్న మించినదై యుండవచ్చును; కాని మనము ప్రారంభించిన అవధిని

మించక ఆయాధారములపైన మాత్రమే నిలిచియుందుము. అట్లనుటచే, ఆధ్యాత్మి కాంతమునుండియు భౌతికాంతమునుండియు ప్రారంభింపబడిన కార్యవిధానము లొండొంటితో సమ్మేళనమును పొందవనుటయుగాని, ఆధ్యాత్మికసిద్ధి తనయందు భౌతికాంతమునుండి పొందబడిన శరీర సిద్ధిని తనయందు మేళవించుకొనదని గాని చెప్పుటలేదు; ఐననట్లు జరుగవలెనేని ఆదర్శము ఆకాంక్షయు ప్రేరణయు ఉన్నతములై యుండవలెను. మానవ జీవితమును దివ్యజీవితముగా మార్చదలంచితిమేని మనము పై విధమున జేయువలసియుండును. అట్టిచో మానవ జీవితకార్యములను మనము పరిగ్రహించి ఆత్మశక్తిచే వానినుత్కృష్ట మొనర్చవలసిన యవసరముండును. వానినట్లు పరిగ్రహించి భౌతికాంతమునుండి పొందవలసిన సిద్ధిప్రయత్నమును తప్పక అనుసరించుచును, ఆత్మశక్తిచేపొందగల ఊర్ధ్వతరసిద్ధి ద్వారమున క్రిందనుండి పొందిన సిద్ధిని పూర్ణమొనర్పవలెను. ఈ చెప్పిన దంతయు అర్థముకావలెనేని, కవిత్వము కళ, దర్శనవిచారము, వాక్సిద్ధి, పృథ్వీజీవితసిద్ధవ్యవస్థ, యనునీవిషయము లెట్లు పూర్ణమొనరింపబడినది తిలకించవలెను. వీనియన్నింటియందు నిమ్నస్థరములలో పొందబడిన సిద్ధి, ఆధ్యాత్మికచేతనావేశముచే విశాలతరదృష్టిచే పైకి గొనిపోబడి, నవ్యతరపూర్ణతరసిద్ధి, దానికొసంగబడుచున్నది. అట్లే శరీరసిద్ధియు పరిణమించవలెను.

అధ్యాత్మమనుటచే, ప్రపంచమునందు జీవితమును త్యజించి ప్రాణజడతత్వ ములను విసర్జించుటగాక, వీనినికూడ ఆధ్యాత్మీకరణమొనర్చుట యన్నచో, పూర్వపుఆధ్యాత్మిక సంస్థలవిధానమునకు వ్యతిరేకముగ కొన్నివిధానముల పరిగ్రహించవలెను. ప్రపంచమును త్యజించక ప్రపంచమునందు దివ్యజీవితమును ప్రధానముగ యుంచుకొన్నట్టి సంస్థ, ప్రపంచమునందలి సాధారణ మానవ జీవిత విషయములతో లోకవ్యవహారములతో సంబంధములు కలిగియుండును. పృథ్విని విడిచికాక, పృథ్వియందది ఈశ్వరకార్యము లొనర్చును. పూర్వఋషుల ఆశ్రమము లందలి జీవితమున కట్టి సంబంధము లుండెను. వారు స్రష్టలు, విద్యాశిక్షకులు మార్గదర్శకులునైయుండిరి ; పూర్వకాలమున హిందూప్రజలజీవితమును వారు తమ ఆధ్యాత్మిక ప్రాబల్యముచే రూపమొనర్చి నియమించి అభివృద్ధి పఱచిరి. ఇప్పటి ప్రయత్నపు క్రియాకలాపములు, జీవితపద్ధతులు, పూర్వమువంటివి కాకపో

వచ్చును; కాని యివియును ప్రపంచమునందు పనిచేయునవియై నూతనసృష్టికారకములై యుండవలెను. సాధారణ జీవిత క్రియావిశేషములతో సంబంధసంపర్కము వీనికికలిగి, ఈ కార్యములయందలి ప్రథమోద్దేశ్యములు, బయట ప్రపంచముతో సమానమైయుండును. ఇక్కడ నిప్పుడు నివాసమేర్పఱచుకొన్న సాధకుల బిడ్డల కొఱకు పాఠశాల నేర్పఱచుట అవసరమయ్యెను. వీరి విద్యావిధానము, కొన్ని మార్పులతో బాహ్యప్రపంచపు విద్యావిధానమునే అనుసరించును. వారి శరీరాభివృద్ధికొఱకవలంబించిన శరీరశిక్షణము, ఆటలు వ్యాయామముల రూపమున, ఆశ్రమ యువక వ్యాయామ సంఘమువారిచే అభ్యసింప బడుచున్నది. ఈ పత్రిక వానిని ప్రకటించినది. ఆధ్యాత్మికాన్వేషకులకొఱకు స్థాపింపబడిన ఆశ్రమమునందు ఆటలకుగల స్థానమేమి, ఆటలకు ఆధ్యాత్మికమునకు గలసంబంధమేమి యని కొందఱు అడుగుచున్నారు. వ్యాయామము జాతిజీవనమందు నే విధముగ నుపయోగకారిగ నుండగలదని ఈ పత్రికయొక్క పూర్వప్రతియందు వివరించిన దంతయు, ప్రపంచ జీవితక్రియాకలాపములతో నిట్టి సంస్థలకుగల సంబంధము నింతవరకు ఈ ప్రతియందు వివరించినదంతయును, మొదటి సమాధానముగ నెంచనగును. మరియొక సమాధానము, ప్రథమోద్దేశ్యమున కావల ఆధ్యాత్మిక కాంక్షతోకూడిన శరీరాన్విత పూర్ణసిద్ధియందు కాంచనగును.

ఆశ్రమ జీవితమునందు ప్రవేశ పెట్టబడిన శారీరిక వ్యాయమక్రీడా విధానములు, వాని ప్రథమోద్దేశ్యములు మనసత్తయొక్క అధోభాగమగు భౌతికకక్ష్యకు సంబంధమైయుండవలెను. ఈ వ్యాయామములు క్రీడలు ప్రారంభమున ఆశ్రమ పాఠశాల విద్యార్థుల కొఱకు ప్రవేశపెట్టబడెను. ఏలన, వారు యుక్తవయస్కులై భవిష్యత్తును నిర్ణయించుకొను సమయమున, ఆధ్యాత్మిక జీవితమునకు మరలుదురో, లేక ప్రపంచ జీవితమునకు మరలుదురో తెలియదు; మరియు, ఆధ్యాత్మిక సాధన, ఉద్దేశ్యములు అననేమో వారికి తెలియదు. వారికి, వ్యాయామోద్దేశ్యములు, శరీర శిక్షకొఱకును, కొన్ని మానసిక సుగుణముల చేకూర్చుటకునై యుండవలెను. ఈ పత్రిక పూర్వప్రతియందు వాని విషయమై చర్చించియుంటిని. అట్టిసిద్ధి, పరిమితికిలోనై మానవాత్మకమై సాపేక్షకమై, యుండవలెను. అధికతరమగు సిద్ధి, ఊర్ధ్వశక్తుల - చైత్యిక ఆధ్యాత్మిక శక్తుల - చే మాత్రము పొంద

నగును. ఐనను మానవుని పరిమితశక్తికిలోనై పొందదగు శరీరాభివృద్ధియు, చాలి నంతపరిమితిగలదై ఒక్కొక్కపుడు అధికమునై యుండనగు. అతాకికప్రతిభ, ముఖ్యముగ మానసిక సాంకల్పిక విషయములందు మానవుడు వికసించి వృద్ధిపొంది సంపాదించగల యొకఅంశము; ఇది ఆధ్యాత్మికదెసకు మనల కొంతదూరము కొనిపోగలదు. శరీరము, దాని ప్రాణశక్తికి సంబంధించిన క్షేత్రమునందుగూడ, శరీరముపై మనస్సు ఇచ్ఛాశక్తి పనిచేసి సాధించిన శరీరసంబంధ సాధనను సహిష్ణుతను, అద్భుతకార్యములను - అలసత అవసాదముల అలక్ష్యముచేయగల సక్రియతను - అసాధ్యమని తలంపబడిన కార్యమును కొనసాగించుచుండుటను - అంత్యములేని శరీరబాధకు పరవశుడుకాకుండుటను - అనునీయద్భుత విజయములు మానవశక్తిచేప్రాప్తమైనవిగ మనము చూచుచున్నాము; ఇవియన్నియు పూర్ణసిద్ధిలో చేరవలసిన యంశములే. యుద్ధమునందును ప్రయాణమునందును ప్రమాదకర యితరసాహస కార్యములందును, శరీరప్రాణ మనస్సులన్నియు సహిష్ణుతావసరముల కంగీకారమొనర్చి దీర్ఘకాలము వెనుదీయక యోర్చుకొనుటయు శరీర సిద్ధిలోని ఒక యంశమే; శరీరమునందలి నిశ్చేతనముకూడ నిట్లు పైకక్షలందలి శక్తులకు ఆశ్చర్యకరముగ జాగరితమైమెలంగును.

శరీరము, నిశ్చేతనపు స్పష్టఫలితమనియు, నిశ్చేతన (inconscient) మేఅనియు, దాని గుప్త కార్యములందును, దాని సత్తయందలి అనేకాంశములయందును అది అవచేతన (sub-concient) యనికూడ చెప్పియున్నాము; కాని మనము నిశ్చేతన మనునది, ఈ అద్భుతఫలితమగు విశ్వమును సృష్టించిన రహశ్చేతన లేక ఊర్ధ్వచేతన (Super concient) యొక్క పరికరము నివాసస్థానము రూపమునైయున్నది. నిశ్చేతనశక్తి జడమును సృష్టించినది; మరియునిది దాని క్షేత్రము; ఈ నిశ్చేతన జడముయొక్క వ్యాపారములందలి దోషరహితత్వము, ఉద్దేశ్యమునకు తగిన ఫలితము నొసంగుటకుగల పరిపూర్ణసంయోజనీయత, అవి యొనర్చు అద్భుతములు, అవి సృష్టించు శోభనీయమగు వింతలు - వీనినన్నిటిని మనము అజ్ఞానముచే నాక్షేపించినను, ఊర్ధ్వచేతన మీాభౌతికలోకమందలి సమస్తక్రియల యందును అంశములందును ఆరూఢమై దాని చేతనాశక్తి చేతనే పనిచేయుచున్నదనవలెను. ఈ ఊర్ధ్వచేతన మనశరీరమందంతర్హితమైయున్నది; శరీరమును నిర్మించిన దదియే;

మన ఎఱుకయందు ఊర్ధ్వచేతన మభివ్యక్తమగుటయే పరిణామముయొక్క గుప్త ఉద్దేశ్యము, మనయునికియొక్క ప్రహేళికకు విడుగడ.

బాల్యదశయందును కౌమారమునందును వ్యక్తికొసంగు విద్యావిధానము నందు వ్యాయామములు పందెములు, శరీరమున గుప్తముగా నున్నశక్తులను, బహిర్గత మొనర్చును. ఆవిధానములు సాధనములు శరీరస్వభావము మీఁద నాధార పడి, మానవశక్తిచే - ఒకేసారి మానవశక్తికి పరికరమును, నివాసమును నగు శరీరద్వారమున - శరీరమునకు, మనస్సునకు, చిత్తమునకు, శీలమునకు నొసంగగల పరిపూర్ణతను కలిగించుటయే వాని ఉద్దేశ్యము. పైవిధానములచే పొందగల పరిపూర్ణతయందు, మానసికనైతికాంశముల అభివృద్ధిని గురించి ముందే చెప్పి యున్నాను; మరల వాని నిపుడు ముచ్చటించ నవసరములేదు. ఈ వ్యాయామ క్రీడలచే, శరీరముయొక్క సహజ శక్తులు గుణములు వృద్ధియగుట యొక విషయము; మనస్సు ఇచ్ఛాశక్తు లభిలషించు కార్యక్రమములందును, మనసూక్ష్మ భౌతికసత్త (subtle physical being)యొక్క ప్రేరణలకు,ఆవేగములకు క్రియాత్మక ప్రతిపత్తులకు అవసరమగు కార్యక్రమములదుంను, సరియగు నుపకరణముగా నుండు శిక్షణపొందుట రెండవ విషయము. ఈ కడపటిది మనము మనస్వభావ మందు సరిగా గుర్తించని ముఖ్యవిషయము. శరీరసహజ పూర్ణతకు, ఆరోగ్యము బలము ప్రథమావసరములు; ఈ బలము అవయవములయొక్క కేవల నరములు, కండరములకు మాత్రమే సంబంధించినదైగాక, సూక్ష్మశరీరాంశముల యొక్కయు స్నాయుగతసత్తయొక్కయు క్రియలయందును, సునమ్యత, దక్షత, సూక్ష్మత, అను గుణ్యత యను నీగుణములతో పనిచేయ సమర్థనీయమై యుండవలెను. రెండవది, ఇంతకన్న వేగవంతమగు ప్రాణశక్తులను శరీరములోనికి ఆహ్వానించి సాధారణ స్థితియందు చేయజాలని అద్భుత కార్యములను శరీరముతో చేయించుట. మూడవది, మనము తెలియకనే, మనముపయోగించునట్టి లేక మనల నుపయో గించునట్టి మానసిక ఐచ్ఛిక బలములు తమ రహస్య శక్తులను ప్రేరణలును అవసరములను శరీరముపైన ప్రయోగించి శరీరమునకు శక్తియొసంగును. శరీరము నిట్లన్నివిధముల మేల్కొలిపి, ప్రేరేపించి శిక్షణమొనర్చుటచే కలుగు సహజ శక్తులు, గుణములలో మనమెంచదగినవివి, - అన్నివిధములైన శరీరకర్మలయందు

నిపుణత, దృఢత, పందెమునందు వేగము, యుద్ధమునందు చతురత, పర్వతారోహణ మందు కుశలత, సైనికుడు నావికుడు పథికుడు, ప్రదేశఖ్యాపకుడు (explorer) అను వీరల శరీరము అనవరతము భరించవలసిన సహిష్ణుత, అన్నివిధములైన సాహస కార్యములందు సందర్భానుసారముగ మానవుని యిచ్ఛాశక్తి ఆవేశమునుపట్టి తానుతన శరీరమున కలపరచిన సర్వధారణాశక్తి. ఇట్లుకొందరిచే మాత్రము సాధింపబడిన నీగుణములు సర్వసాధారణముగ అందరియందును సహజగుణములుగా నేర్పడుకొరకు, ఇక్కడనివ్వబడు శరీరశిక్షణాభ్యాసములు యుద్దేశింపబడినవి. ఆటలు పందెములు అనుశీర్షికక్రింద కొన్నివిధానము లేర్పఱుపబడినవి; వ్యాయామశిక్షణ ములు, మరికొన్ని ఆటలు, మరియొక శీర్షికక్రింద చేర్చబడినవి; ఇవన్నియు ఫలప్రదాయకమైయుండును. సాముదాయికకార్యమునకును, సంఘీభావమునకును తగిన శిక్షణకు అవసరమైన వ్యాయామములు కొన్నికలవు; అవి సాముదాయిక ముగ యొసగంబడుచున్నవి; మరికొన్ని వ్యాయామములు వ్యక్తియందు, ఇచ్ఛా శక్త్యభివృద్ధిని, మనోసూక్ష్మతను, త్వరితప్రతిపత్తిని, ప్రాణశక్తియొక్కబలాధిక్య తను, సూక్ష్మశారీరికావేగములను, కలుగజేయునవియై, వ్యక్తికి అత్యవసరమై యుండును. శరీర సహజశక్తులలో వీనియన్నిటిని చేర్చవలెను; మానవుని సేవ కొరకు శరీరము, సామర్థ్యమును, ఔపకరణికౌచిత్యమును కలిగియుండవలెను; అందుచే శరీరపూర్ణసిద్ధి యందివియన్నియు నిమిడియున్నవి.

ఈపూర్ణసిద్ధికి రెండువిధానములున్నవి. మొదటిది, శరీరమున గుప్తమైయున్న చేతనను వీలుగలిగినంతవరకు మేల్కొలుపుట; రెండవది, దాని శక్తులను బయట కావహ్వానించి అభ్యాసపఱుపగల నన్నిమార్గములందును, వృద్ధికావించుట. జడరూపము, లేక శరీరము, దాని ఆత్యంతికస్వభావమున, నిశ్చేతన సృష్టియై అన్నివిధముల దానిచే బద్ధమైయున్నను, నిశ్చేతనమందు దాగియున్న గుప్తచేతనను బహిర్గతమొనర్చుచు, ఆనందశక్తిజ్ఞానజ్యోతుల ఆవరణలో వృద్ధికాంచునదియై యున్నది. మానవుని పరిణామ ప్రక్రియయందది యెంతవరకు పైగుణముల నలవరచు కొనగలదో, అంతవరకుదాని నుపయోగించుచు, ఇంకను ఆయావ్యక్తియందలి స్వాభావమును గుణమును పట్టి అదిపోగలిగినంతమేరకు దానిని వృద్ధికావింపవలెను. ప్రపంచమునందన్ని వస్తురూపములందును, ఒకానొకశక్తి యావస్తువుకు తెలియకనే

పనిచేయుచుండును; లేక ఆవస్తువుయొక్క నిమ్నవ్యవస్థయందు దానిస్తబ్ధతచే బంధింపబడి మేల్కొననుత్సుకమైయుండును; కాని మానవుని శరీరమందాశక్తి మానవుని ఎఱుకకందినదై, మేల్కొనియో లేక నిద్రించుచునో, లేక కొంతమేల్కొనియు కొంత నిద్రించుచునో పనిచేయుచుండును. మేల్కొనినశక్తికి మానవుడు పూర్ణచేతన నొసంగవలెను; నిద్రించుశక్తిని, మేల్కొలిపి అభ్యాసపఱుపవలెను. ఈ స్థూల చేతనకు రెండంశములుకలవు; ఒక్కటి, యంత్రసదృశమై భౌతికకక్షయందు మనసుకు తెలియక, మనసుచే గుర్తింపవీలుగాక మనసుయొక్క ప్రేరణమెంత మాత్రము లేక శరీరమునందలిజరుగు యంత్రక్రియాసదృశ కార్యము; ఇదియొక వేళ మనసుచే ప్రారంభింపబడునేని, తర్వాత దానియాదేశము లేక, స్వయంప్రవర్తకమై జరుగుచు మనము నిర్దేశించినచో నిలిచిపోవును.

రెండవ అంశము, మనసుచే బోధింపబడి శిక్షింపబడి యాంత్రికముగా నిర్దోషముగా తమంతట యవి మనసుచే తర్వాత గమనింపబడక జరుగు శరీర ప్రవృత్తులు గలవు; మరికొన్ని, నిద్రయందు ప్రగతినొంది మేల్కొనునంతలో ఫలప్రయోజనము నొసంగునవిగలవు. కాని ముఖ్యవిషయమేమన, కన్ను చెవి చేతులు మొదలుకొని సర్వావయవములకు శిక్షణనిచ్చి, అభివృద్ధికాంచబడిన స్వయం ప్రవర్తకశక్తిని చేకూర్చి, మనః ప్రాణ శక్తుల ఆ దే శా ను సా ర ము శరీరము చక్కని ఉపకరణముగా మారి ఇచ్ఛికముగా పనిచేయ సమర్థమైయుండవలెను. భౌతికాంతమునుండి, దానికనుగుణ్యమగు విధానములచే ప్రారంభింపబడిన సాధన, పొందగల పరమావధి యుంతే. ఇంతకు మిక్కుటమగు శరీరసిద్ధి నాసించితిమేని, మనఃప్రాణశక్తులయో లేక ఆత్మశక్తియో సహాయము కావలసియుండును. భౌతిక క్షేత్రమునందు, భౌతిక సాధనములతో కావింపబడిన అభివృద్ధి భద్రత లేక, అవధులకు లోనైయుండును. పూర్ణశరీరారోగ్యబలములని తోచునవియుగూడ, నేనిమిషమైనను బాహ్యసంఘట్టనలచే లేక ఆంతరిక మార్పులచే భగ్నముకాగలవు. మన పరిమితులను దాటుటచే మాత్రమే ఉత్తమతర శాశ్వతతర సిద్ధిచేకూర గలదు. ఆంతరిక చేతన లేక ఊర్ధ్వచేతన మనశరీరమును స్వాధీనపఱుచుకొని, శరీర సత్తసచేతనముగ నాశక్తులను తెఱచుకొని, వానిని శరీరమునందు ప్రవేశపఱచి, మార్పుపొందించుట ముఖ్యమగునొకమార్గము. మానవుడతని స్వభావమునం

దతిశయముగ మనోమయుడు; ఆతడు మనోమయపురుషుడగుటచే నాతని మానవ పరిపూర్ణతయు, ఉపనిషత్తులలో చెప్పిన రీతిగ, శరీర ప్రాణముల కధిష్ఠాతగా మనసును లేక మనోమయపురుషుని చేయుటచేనగును. స్థూలభౌతిక శరీరము, సూక్ష్మభౌతిక చేతనము, ప్రాణశక్తి, వీనియొక్క ప్రేరణలను, అంధప్రవృత్తులను మనస్సు స్వాధీనపఱచుకొని మనస్సు వాని సేతలలో ప్రవేశించి, ఎఱుకతో వాని నుపయోగించి, వాని అంధప్రేరణ క్రియలను మనోగతమొనర్చినచో, ఆశక్తులును వాని క్రియలును సచేతనము పూర్ణమునగును. కాని మనస్సుకూడ పరిపూర్ణత కాంచుటవసరము; దీని పరిపూర్ణత భౌతికమనస్సు యొక్క ప్రజ్ఞపై నాధారపడక, తర్కప్రధాన సూక్ష్మక్రియ కార్యాచరణచేగూడ బద్ధముకాక, స్వతఃస్ఫురణమందభి వృద్ధిగాంచి, దాని విశాలగాఢ సన్నిహిత ప్రకాశతర యిచ్ఛాశక్తి యొక్క ప్రవర్తకబలమును పొందవలెను. ప్రస్తుత పరిణామపరిమితులలోగూడ మనస్సు, తనప్రభావమును శరీరముపైపఱపి, ఎట్టి ఔన్నత్యమునకు కొనిపోగలదో, లేక శరీరశక్తి సామర్థ్యములనెంత ఘనముగ నుపయోగించుకొనగలదో చెప్పజాలము; మానవమాత్రమగు నిప్పటి పరిణామావధిని దాటి పైకి మనసుద్గమించి ఉచ్చతర శక్తులనందుకొనెనేని, అది శరీరముపై పనిచేయగల అవకాశముల నిర్ణయించుట కష్టతరమగును; కొన్ని అనుభవ సందర్భములందు శరీరావయవముల క్రియను ఇచ్ఛచే నియమింప సాధ్యమగుట చూచుచునేయున్నాము. శరీరముపై ఉన్నత శక్తుల ప్రభావపరిమితులు తక్కువగుకొలది, శరీరము నమ్యమై మార్పునొంద సమర్థమై యిచ్ఛాశక్తికి, అధికతరపూర్ణ, ఉచితయుపకరణమగును. ఈ భౌతికప్రపంచ మందభివ్యక్తమగు నున్నతకార్యములు ఫలసిద్ధిపొందవలెనన్న, మనసత్తయందలి భౌతికాధ్యాత్మికాగ్రముల రెండింటి సహకారమత్యవసరము. అలసతచేకాని, స్వాభావికాశక్తతచేకాని మరేకారణముచేకాని, శరీరము, ఇచ్ఛాశక్తిని బుద్ధిని ఆమోదింపజాలదేని, లేక వాని యాదేశానుసారము ప్రవర్తించలేదేని, ఆ కార్య ఫలసిద్ధియందంతవరకు లోపముండును. ఆత్మయొక్క విక్రమమని చెప్పదగు మానసికకవితావేశమునందు, మెదడు ప్రతిస్పదింప సమర్థమై వివేచనము సూక్ష్మ సందర్శనము ప్రకాశములతోకూడిన భాషణమునకు తగిన వాహికయగుటకుస్థి లనమై యుండవలెను. మెదడు అలసతనొందెనేని లేక మందమయ్యెనేని, ఆవేశము

కలుగకపోవచ్చును; లేదా ఆయావేశము నిమ్నస్వభావమైనదై యుండవచ్చును. అందుచేనది ఆత్మావేశ ఫలితముగాక, కవితాయుపాయ ఫలితము మాత్రమే కావచ్చును. శుద్ధ మానసిక క్రియలందే యైనను శరీరము తగిన, సిద్ధ, పూర్ణ పరికరముగా నుండుటత్యవసరము. అట్టి సిద్ధత, ప్రతిస్పందనసమర్థత, శరీరకృత్స్న సిద్ధియందలి అంశములే.

పృథ్వియందభివృద్ధి గాంచుచుండు నీ పరిణామముయొక్క ముఖ్యప్రయోజనము లక్షణము, ఈ దృష్టి గోచరనిశ్చేతన బగత్తునందు చేతనము అభివ్యక్తమై, క్రమోన్నతస్థితులలో వెలిపఱచుకొనుటయు, దానితోపాటు సత్త్వములు శక్తి ప్రకాశముల నావిష్కరించి, అభివృద్ధిని కాంచుట; జీవిత పరిణామప్రయోజన మిదియైయుండ, శరీరముమాత్రమే వృద్ధిగాంది, అతిజీవితమున (survival) కర్హత పొంది, శరీరమును స్థిరస్థాయిగ నొనర్చుట పూర్ణప్రయోజనమును ఉద్దేశ్యమును కాజాలదు. చేతనఅధికాధికముగ జాగరితమగుట, జాగరితమై ఉన్నతోన్నతభూమికల కారోహించుట, అరోహించుటతో సమముగా నీ సూక్ష్మదర్శకచేతనము విశాలతర క్షేత్రముల వ్యాప్తింగాంచుట జీవితోద్దేశ్యమగును. పరమము పూర్ణమునగు సిద్ధియొక్క ప్రగతికట్టి జీవితోద్దేశ్యము ముఖ్యావసరమైయున్నది. శరీర పూర్ణ సిద్ధికినిగూడ నిది యవసరమే. మనమూహించగలవానికన్న నున్నతతర మానసిక కక్షులుగలవు; వానిలోనికి మనముద్గమించవలెను. మానసిక కక్షుల కవ్వలనుండు ఆధ్యాత్మికయునికి యొక్క ఉచ్ఛ్రియ స్థితులనుగూడ మన మారోహించవలెను. మనము పైకిపోవుకొలది, మనసత్తయొక్క క్రింది అంశములను దానికి తెచ్చి, వీనిని ఆయున్నతక్రియాత్మక జ్యోతిశ్శక్తులతో పూరించవలెను; మనశరీరమును అధికాధికముగ, సంపూర్ణముగ చైతన్యముయొక్క సచేతన పరికరముగ నొనర్చి, దాని సంకేతనమే, దాని నిర్ణయముద్రయే, దాని ఆవిర్భూతశక్తియే, యిది యనునట్లు శరీరమును మార్చవలెను. అది ఈ పూర్ణతయందు వృద్ధియగుకొలది, చైతన్యమునకది యొసంగు ప్రతిస్పందనయు, దాని క్రియాత్మకశక్తియు, జీవితమున కది యుపకరించగలశక్తియు అధికము కావలెను; చైతన్యమునకు దానిపైగల వశత్వమును వృద్ధికావలెను; ప్రస్తుతము నైశ్చేతిక యంత్రక్రియా సదృశముగా నగుపడునట్టి శుద్ధ అవయవికచేష్టల సందర్భమున శరీరము సునమ్యము కావలెను,

ఇదియంతయు పూర్ణరూపాంతరముచే గాని సాధ్యముకాదు; అట్టి శరీర ప్రాణ మనస్సుల రూపాంతర సిద్ధికొఱకే మన పరిణామవిధానము రహస్యముగా నడచుచున్నది; ఇది జరుగదేని భాగవతజీవిత పూర్ణవికాసము పృథ్వియందు ఫలించదు. ఈరూపాంతరమునందు శరీరము భాగస్వామియు ప్రతినిధియు గావలెను. అసంపూర్ణముగ చేతన మొనరింపబడి, రూపాంతరమొందని, వశవర్తియైన శరీరమును, చైతన్యము భౌతిక కార్యములకు సాధనముగా నుపయోగించుపట్ల అనల్పకార్యమునే సాధించవచ్చునుగాని, యిది మనము కోరు పరిపూర్ణ సిద్ధికాదు. పూర్ణసచేతనాశరీరము మాత్రమే, భౌతిక రూపాంతరముయొక్క నిర్దిష్ట భౌతిక విధానమును ప్రణాళిని కనుంగొని కార్యకారికాగలుగును. ఇందుకొఱకు, ఆత్మ లేక చైతన్యము యొక్క పరమజ్యోతిశ్శక్తి-స్పష్ట్యానందములు మానవుని ఉన్నతోన్నత ఎరుకయందేనియు నావిర్భవించి, ఆస్థానమునందుండి శరీరమునందు తన ప్రభుత్వమును స్థాపించి యుండవలెననుట సందేహములేదు; అయ్యును శరీరముకూడ స్వాయముగ అవిచార్యకృతముగా ఆధ్యాత్మికావిర్భావమునొనర్చవలెను. ఈవిధముగ శరీరము తన్నుతా రూపాంతరమొందించుకొనుటలోను, సమస్తసత్తను కృత్స్నముగ రూపాంతరము పొందించుటలోను భాగస్వామియు కార్యకారియు నైయుండును; ఇదియును శరీర కృత్స్నసిద్ధియందొక అంశము, చిహ్నము, నిదర్శనమును అగును.

చేతనము బహిర్గతమై వృద్ధియగుటయే, పరిణామముయొక్క యుద్దేశ్యమయ్యేనేని, పరిణామముయొక్క గుప్తప్రయోజనమునకును అదియే సమస్యాపరిష్కారమయ్యేనేని, పరిణామస్వభావమునుబట్టి చేతనాశక్తులు అధికాధికముగ విస్తృతినొందవలసినదేగాక, ఉన్నతోన్నతముగ నూర్ధ్వస్థితులకును, అంత్యముచేరువరకు పోవలెను. ఏలన నిశ్చేతనమందు అంతర్నిహితియొక్క కనిష్ఠభూమికనుండి ప్రారంభించి, అది జడమునందు పనిచేసి, జడప్రపంచమును సృష్టించినది; అనవరతము జ్ఞానముగా ప్రవృద్ధికాగల అజ్ఞానముతో, అది (చేతన) జడమునందు తన కార్యమును ప్రారంభించుచు, పోవుకొలదిని అధికతర ప్రకాశమును పొందుచు, తన సహజ అంతర్గతశక్తులు బహిర్గత మగుకొలది వ్యవస్థీకరించుచు, సమన్వయ పఱచునిచ్ఛాశక్తి కలిగినదై ప్రగతినొందుచుండును; అంత్యమున

అది చేరవలసినస్థితి, పూర్ణశక్తి పడసినదై, జ్ఞానముకొఱకన్వేషించు అజ్ఞానము గాక, జ్ఞానము స్వయంగతమై స్వాభావికమై, దోషములు పరిమితులులేని సహజ సత్యసందర్శనమును గలిగి, తనసత్యములకు తానే ప్రభువైయుండును. అట్లుగాక, పరిమితి గలిగినదై యుండవలసెనేని, ఆపరిమితిని స్వయముగా నారోపించుకొన్నదై, తెరవెనుక పూర్ణసత్యమును వహించియు, తగినకాలమున అభివ్యక్తపఱుప సన్నద్ధమై, ఇచ్ఛాపూర్వకముగ, వెతుకుటకుగాని, ప్రయత్నించి చేయుటకుగాని అవసరములేక, అప్రయత్నముగ కాలపురుషుని నియమానుసారముగ యుక్త సమయమున నావిష్కరించును. ఇట్లనుటచే, వ్యక్తిఋతచేతనయందుపస్థితమై తన నిజతత్త్వముల నెఱిగి, కాలపురుషుని సృష్టివిధానమందు సత్యధర్మమును నిర్దోష ముగా పూర్ణసామంజస్యతతో ప్రకటింప స్వయంసమర్థుడై యుండుననుట; ప్రతిచింతనయు, ఇచ్ఛయు ఆవేగము క్రియయు ఇచ్ఛికమై ఋతయుతమై స్వయం స్ఫురితమై, సత్యప్రకాశమున చరించునదై, అందుచే పూర్ణమునైయుండును. సర్వము, చైతన్యము లేక ఆత్మయొక్క స్వాభావిక సత్యముల తెలుపునదైయుం డును; ఆత్మశక్తియొక్క పరిపూర్ణత అందుండును. అతడు ప్రస్తుత మానసిక పరిమితులను దాటియుండును; అతని మనస్సు సత్యజ్యోతిని చూచునదై, అతని యిచ్ఛ సత్యశక్తితోనేకమై, అతని జీవితము సత్యమును క్రమికముగ తనయందు సిద్ధిపఱచుకొనునదియై యుండును; అతని శరీరము సత్యమునకు సచేతన పాత్రయై, స్వయంసిద్ధికి సాధనమై, స్వయంసంవేదితావస్థితికొక ఆకారమై యుండును. భూమిపై, ఆధ్యాత్మిక చేతన మావిర్భవింపవలసి యుండెనేని, భాగవతజీవితము సిద్ధింపవలసియుండెనేని ఈ ఋతచేతనముపక్రమించవలసియుండును. దీని ప్రారంభ చిహ్నము, క్రియ, ప్రవర్తకము కావలెను. లేక కనిష్ఠము, ఈఋతచేతన మన మనఃప్రాణ శరీరములతో సంసర్గమై శరీరమునందవరోహించి, దాని ఉద్దేశ్యము లను ప్రచోదనమొనరించి, దాని శక్తులను స్వాధీనపఱచుకొని వాని విధానమును ప్రయోజనమును రూపమొనరించవలెను. ఋతచేతననుస్పర్శించిన ప్రతియొక్క డును దానినిపూర్ణముగా తనయందు మూర్తీభవింపచేయ లేకున్నను, ప్రతియొక్క డును తమతమ ఆధ్యాత్మిక స్వభావమును, ఆంతరికశక్తిని, ప్రకృతియందు తనపరిణామ రేఖను, అనుసరించి, దానికొకరూపమునిచ్చును; అతడు తత్క్షణము పొందగల

సిద్ధిని పొంది, ప్రకృత్యాత్మలసత్యమును పూర్ణముగా పొందు మార్గమున నడచును.

ప్రాతిభాసికమగు శూన్యమునుండి సువ్యవస్థితమగు విశ్వమును పరిణమింప జేసిన నిశ్చేతనముయొక్క లేక నిశ్చేతనముగాకనబడు శక్తియొక్క స్వయంప్రవర్తక దోషరహిత కార్యముల స్థానమున, ఋతచేతనము తనయందలి సత్యమును, ఇచ్ఛాపూర్వకమగు స్వయంప్రవర్తక మార్గమున ఎఱుకతోనడుపును; ఈ ఋత చేతనము భాగవత జీవితపు నూతన విధానమును సృష్టించుటచే కృత్స్నము పరమమునగు సిద్ధియుగూడ సంభవనీయముగా గోచరించును. భౌతిక ప్రపంచము లోని కీ ఋతశక్తిని తేగలిగితిమేని మనము యుగయుగములనుండి కనుచుండిన కళను, – మానుష్యక పరిపూర్ణత, వ్యక్తిగతసిద్ధి, సంఘసుపరిణతి, జాతిపరాకాష్ఠ, స్వాత్మవశత్వము, తనపైతనకు పూర్ణ ఆధిపత్యము, ప్రకృతిశక్తులను స్వాధీనమందుంచుకొని ప్రయోజనమునకుదెచ్చుట యను నివియన్నియును– కడపటికి సిద్ధించుటచూడనగును. మానవుని ఈ పూర్ణసాఫల్యత, అవధులదాటి దివ్యజీవితస్వభావముగ రూపాంతరమొందిన దనవలెను. జడము, తనలోనికి ప్రాణశక్తిని మానసిక ప్రకాశమును తీసికొని వానిని అభివ్యక్తపఱచినతర్వాత, ఆత్మయొక్క శక్తిని తేజస్సును ఆహ్వానించి, మట్టితోకాబడిన స్థూలకాయమునుండి దాని ఎఱుకలేమి అంశములను త్రోసిపుచ్చి, ఆత్మయొక్క నిండు ఎఱుకతోకూడిన రూపమును ధరించి–నిలుచును. ఈ దేహమున వసించుదేహి, తన యిచ్ఛాశక్తులచే దేహమునకు పూర్ణారోగ్యబలముల స్థిరపఱచును. జడశరీరము యొక్క సహజసామర్థ్యములు, జడచేతనయొక్క సర్వశక్తులు వాని పరమ విస్తృతినిగాంచి ఆజ్ఞానువర్తులై నిర్దోషవర్తనము కలిగియుండును. ఉపకరణమగు శరీరము, తన పూర్ణశక్తులు వికసించియుండ, అంతరవాసియగు దేహికోరుసత్యప్రయోజనములకొఱకు, పూర్ణౌచిత్యమును నొందియుండును. దీపము వెలుతురును ప్రసరించునట్లు, దేహము ఆత్మప్రకాశసౌందర్యమును ప్రసరించునదియై, ఆత్మానందమును, ఆత్మతృప్తిని, మానసిక జ్ఞానోల్లాసమును, ప్రాణసుఖమును, ఆధ్యాత్మచేతనయందు మగ్నమొనర్పబడి అనవరతము హర్షపారవశ్యమైన జడముయొక్క ఆహ్లాదమును కలిగినదై, పరమ సౌందర్యానందముల ప్రకటించు భాజనమై, అది యొప్పనగును; ఇది ఆధ్యాత్మి

కరణంబైన శరీరముయొక్క పూర్ణసిద్ధి.

ఇదంతయు నొక్కసారి యాకస్మికముగ కలుగకపోవచ్చును; కాని దివ్య శక్తి ప్రకాశానందములు, మన సత్తయొక్క కడపటి చేతనాభూమిక నధిష్ఠించి ఆ స్థానమునందుండి తమ శక్తిని శరీర ప్రాణ మనస్సులలోనికి గ్రుమ్మరించి, జీవకణములను ప్రకాశిత మొనర్చి, వానికి నూతన నిర్మితినిచ్చి శరీరమునందన్ని భాగములందును చేతనను జాగరిత మొనర్చెనేని, అట్టి యాకస్మిక సిద్ధి సాధ్యము కావచ్చును. ఆకస్మికసిద్ధి కాజాలదేని వ్యక్తి అనుక్రమికముగా తానందుకోగల గమ్యమును చేరుటకు మార్గమేర్పరుప బడును. ఈ సర్వాంగ సిద్ధియందు, భౌతికాంశమునకుగల భాగఫలము దానికి చెందవలయును.

ముక్తపురుషుడు పరమతత్వమును, సచ్చిదానందమును పొందు ప్రగతియందు, అనంతచైతన్య మాతని పరిణామాత్మక ప్రకృతిని నున్నతతర శిఖరములకును, విశాలతర ఆవరణములకును గొనిపోవు మార్గమున, పోవుకొలదిని దివ్యభూమికలు దర్శింపనగును. వీనినిగూర్చి చర్చించుటనవసర ప్రసంగ మగును; ఇంతవరకు చర్చింపబడిన విషయమే, మానవుని మనస్సు ఆశించ గలిగిన దంతయు, ప్రఫుల్ల వివేచనము గ్రహించగలిగిన దంతయునై యున్నది.' ఋతచేతన మవతరించి జడమును రూపాంతర మొందించుటచే గలుగు ఫలితములు, ప్రకృతి పరిణామ ప్రయాసమునందుగల కష్టముల కత్యంతముగ తగిన పరిహారములై యున్నవి. చైతన్యముయొక్క సర్వసమాధారకప్రకృతి తన కార్యమునొనరించు సమయమునందే, సర్వమును తనయందువహించి రూపాంతర మొందించగల ఆ పరాప్రకృతియొక్క అవతరణయు, ప్రస్రృతికార్యమును, నేకకాలమున జరుగగలవు; ఈ ద్వివిధ కార్యముల ఫలితముగ, భౌతికవస్తువుయొక్కయు, భౌతికచేతనయొక్కయు, భౌతికరూపముయొక్కయు మార్పు ఆశ్చర్యకరముగ సిద్ధించును; దీనిని మనము కృత్స్నశరీరసిద్ధియనిమాత్రమే గాక శరీరముయొక్క పరమసిద్ధియనికూడ చెప్పనగును.

# శుద్ధానంద కృతులు

## పుణ్యభూమి

అఠాణ రాగము : ఆది తాళము :

పల్లవి

పుణ్యభూమి నీదే – పరి
పూర్ణ యోగజ్యోతి – ఈ (పుణ్య)

అనుపల్లవి

గణ్యులైన సిద్ధులు – వీర ప్రబుద్ధులు వెలయు
కరుణాలయ శ్రీకాంత నిలయమైన – (పుణ్య)

చరణము

సత్వగుణంబులు నిండిన
జ్ఞానము పండిన
శాంతగాన వనమా – ఓం
తత్త్వమసి యను నతుల గతుల విను
ధర్మ నికేతనమా –
శుద్ధ స్వతంత్ర సమత్వ ప్రసిద్ధమా
సుర నర సామ్రాజ్యమా
సుందర స్వారాజ్యమా
శుద్ధానంద దివ్య స్వర్గరాజ్యమా – జయ. (పుణ్య)

# కాపాడవే

సురటి రాగము : ఆది తాళము :

పల్లవి

కాపాడవే - కరుణా కటాక్షి
కలితీర్చి సత్య యుగము నొనర్చి (కాపా)

అనుపల్లవి

నీ పాదమే నెరనమ్మితి
నిండుముద్దుగారి ఉండి నా మతిలో (కాపా)

చరణము

పగ రాక్షసు లను శిక్షించి
పరమ భక్తులను బాగుగా రక్షించి (కాపా)
ఇహాములోను ధర్మ మును ఆదరించి
ఎక్కువైన దిగ్విజయము గాంచి (కాపా)

# జ్ఞానజ్యోతి

నాటకురంచి ఆదితాళము

పల్లవి

జ్ఞానజ్యోతిజూపి నను బ్రోవవే
నాదబిందు కలాతీత నారాణి – ఓం (జ్ఞాన)

అనుపల్లవి

మానశిఖరమందు ముద్దుగా వెలయు
మోక్ష తుర్యాతీత
పరమాక్షరి – ఓం (జ్ఞాన)

చరణము

అంతరాత్మ నిజ చింతనంబులో
అతిశయనవ రస గానముతో
సుందర నటనా నంద లీలలాడు
శుద్ధశక్తి – ఓం — సురరాజగౌరి (జ్ఞాన)
జన రంజని మన రంజని
భవ భంజని జగజ్జనని – ఓం (జ్ఞాన)

# ఇహా పర సుఖ దా యికీ

వసంత రాగము　　　　　　　　　　　　　　　　రూపక తాళము

పల్లవి

ఇహాపర సుఖదాయకి – అంబ
ఈశ్వరీ శుభ నాయకి　　　　　　　　(ఇహా)

అనుపల్లవి

జగజీవ పర పరంపర
తత్వజ్ఞాన సిద్ధి యొసగు　　　　　　　　(ఇహా)

చరణము

ప్రేమ హృదయ సింహాసిని
ప్రియ భక్త జనరక్షిణి
శ్రీకరి శృంగార గౌరి
చిదాకాశ ప్రణవాంకురీ
సహస్రార అరవిందం
వికసించు నవజీవన
సదానంద శుద్ధశక్తి
సద్గుణ నిత్య కళ్యాణి　　　　　　　　(ఇహా)

# ప ర దే వి

శ్రీరాగము　　　　　　　　　　　　　　　　　　　　　　　　రూపక తాళము

పల్లవి

పర దేవి –సౌ
భాగ్యలక్ష్మి మము పాలింపు　　　　　　　　　　　　(పర)

అనుపల్లవి

వరదాయకి జయనాయకి
వాగీశ్వరి త్రిపుర సుందరి　　　　　　　　　　　　(పర)

చరణము

అరుణ కిరణ తేజోన్మయి అనంతగుణ చిన్మయి
ఆత్మశక్తి విలాసిని అంతరాత్మ వికాసిని
కరుణారస పరిపూరణి శరణు వేద వాణి–
కనికరముగ కటాక్షించు కామితఫల మొసగుతల్లి
కనక శుద్ధానందవల్లి —　　　　　　　　　　　　(పర)

# సేవాభాగ్యము

కళ్యాణి రాగము — రూపక తాళము

పల్లవి

నీ సేవ భాగ్య మియ్యవే - నను
నిజ దాసుడను జేయవె - అంబ. (నీ)

అనుపల్లవి

ఈశావాస్యమైన భువిని
ఏలు శక్తి మేలు మేలు (నీ)

చరణము

ఆశాపాశ బద్ధమైన అడుసులోన పడిపోర్లక
అహంకార రహితమైన అమలచిత్త మొసగి
తేజోన్మయ చిన్మయ
దీపము వెలిగించి
దివ్య శుద్ధ జీవానందము భవ్య భక్తులకు గలుగ (నీ)
ఝుంకార స్మృతికూర్చి
సప్తస్వరము సంచరించ
శృంగార వర వీణా
గాన పూజ నియమముతో (నీ)

# నీవే గతి

అసావేరి రాగము ఆదితాళము

పల్లవి

నీవే గతి యని నమ్మితి
నీరజనయనీ దారి జూపవే (నీవే)

అనుపల్లవి

దేవాతి దేవులు వందనము -
జేయు సాయుజ్య - సామ్రాజ్య లక్ష్మి (నీ)

చరణము

చరణారవింద పదరేణుక
చాలు నన్నుబ్రోవ సర్వ దేవ దేవి
మరణభయమును మాన్పి నిత్య దివ్య
మంగళ మొసగు మహాశుద్ధశక్తి (నీ)

# ఏష ధర్మ స్సనాతనః

**Adopted from Sri Aurobindo's**

*" Defence of Indian Culture "*

భారతీయ ఆధ్యాత్మ తత్త్వదర్శనము, విమర్శనము, సుప్రశస్తముగను, మహోజ్జ్వలముగ నున్నది. ఇయ్యది ప్రాచీనమయ్యును, మహోత్కృష్టముగ నున్నది. దీనికితర్వాత యెన్నియో నవీనమతములు స్థాపింపబడినవి. కాని, వేద ఋషుల పవిత్ర ఆధ్యాత్మిక భావములకు, అనుభూతికి, వేరెవ్వియు సాటిరావు. ఈ ఆర్య భావముల కొంతవిమర్శింతము.

ఏకమ్ సత్, విప్ర బహుదావ దంతిః భగవత్పదార్థ మొకటయ్యు, అనేక పేర్లతో వెలయుచున్నది. (ఇది వేదరీత్యా) ఏకమే వాద్వితీయమ్: భగవాను డొకడుతప్ప వేరొండులేదని, ఉపనిషత్తు సాటించుచున్నది. ఈ సత్తునుండే సకల పదార్థము లుత్పన్నమయి, అందులోనేవెలిగి, తుదకచటికేగి, లీనమగుచున్నవి. ఈ మహోత్తమ తత్త్వరాజమును కనుగొని, దానిని సమీపించి, అఖండ సచ్చిదానందముతో నైక్యమగుటయే, ఆధ్యాత్మానుభూతియొక్క తుదిమెట్టు. భారతీయుల సనాతన ధర్మముయొక్క మొదటి భావమిది.

రెండవ భావమేమన; ఈ అఖండ సత్పదార్థము చేరుటకు అనేకమార్గములు కలవు. ఈ అనంత పదార్థములో అనేకమైన అనంత పదార్థములున్నవి. ప్రతిఒక అనంత పదార్థము ఆ అఖండపదార్థముయొక్క మహదంశమే. జగత్తులో, భగవాను డనేకవిధముల, నానారూపముల, వికాసమునొందియు, ప్రతిరూపము, విధము, ఆయనయే. ప్రతి ఖండవస్తువునందును, ఆ అఖండ సత్పదార్థమును దర్శించి, చేరవచ్చు. నానాదైవములు ఆ సత్పదార్థముయొక్క అంశములే. సుభాసుభములందు, యింకను మనకుగోచరించు ద్వంద్వములందు, త్రిగుణములందు, భగవానునుని కాననగు, ఆయనే, సృష్టి, స్థితి, లయకారుడై, బ్రహ్మ, విష్ణు,శివుడు

లేక ఉదు్రిడగుచున్నాడు. జగన్మాత ఆ పరమేశ్వరుని యొక్క పరమ తేజస్సు. మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి అనుశక్తులు, ఈ జగన్మాత స్వరూపములు, అంశములు. జీవుడు తనస్వభావము ననుసరించి, తన అధికార రీత్యా, భగవానుని చేరకల్గు ; తనలోనే కాక, విశ్వమంతట జగదీశుని కాననగు.

ఇక, మూడవ భావమేమన ; వ్యష్టియందు, సమష్టియందు, భగవానుడున్నాడనుటయే కాక, విశ్వమందలి ప్రతిపదార్థము, వ్యక్తి, యివన్ని ఆ సచ్చిదానందునితో ఆంతరిక సంబందముకల్గి, తుదకు ఆయనయం దైక్యమగుచున్నవను దృఢవిశ్వాసము. మనలో దైవముకలడు. కావున, మనలో నాయనను కనుగొనవలెను. నానాత్వములో ఏకత్వము దర్శించుట, ఏకత్వములో నానాత్వము చూచుట, సర్వము బ్రహ్మమని తెలిసికొనుట.

భగవంతునిచేరుట కనేకమార్గములుకలవు. కాని, ఏమార్గమునబోయినను, తుదకు అనుభూతి నొందవలసిన దేమన ; మనుజునిలో భగవంతుని చూచుట, భగవంతునిలో మనుజుని చూచుట, ప్రకృతిలో భగవద్దర్శనము, భగవానునిలో ప్రకృతి కనుగొనుట, అన్నివస్తువులయందు భగవన్వీక్షణము, భగవంతునియందన్నివస్తువులను చూచుట, తుదకు, వీటన్నిటి కావలనుండు పురుషోత్తమునిచూచి, ఆయనయం దైక్యమగుటయు, ఆయనస్వరూపు డగుటయు. అన్నియుగముల వారవలంబించవలసిన సనాతన ధర్మమిదియ; ఏషధర్మస్సనాతనః .

# వేదరహస్యము

"ముప్పది సంవత్సరములకు పూర్వము శ్రీ అరవిందులు 'ఆర్య' యను తత్త్వజిజ్ఞాసపర మాసపత్రికయందు 'వేదరహస్య' మను శీర్షికక్రింద వేదమును గూర్చిన తమ సిద్ధాంతములను విశదపరచిరి. అది యింకను పుస్తకరూపమున ప్రకటించబడలేదు. దానంజేసి పాఠకులకది లభించజాలదు. దానితో ఋగ్వేద మంత్రముల అనువాదము కొంత చేర్చబడినది. అది కేవల మనువాదము కాక వ్యాఖ్యయే అగును. దానికి 'గుహ్యావిదుల సిద్ధాంత' మను ఉపోద్ఘాతము వ్రాయబడినది. తదనంతరము ఋగ్వేదమండలము లన్నింటియందలి అగ్ని సూక్తములకు సన్నిహిత పూర్ణానువాదము వ్రాయ సంకల్పించిరి. రెండు, ఆరు మండలముల లోని ఈ సూక్తములను ప్రథమ మండలమందలి కొన్నిటితో పుస్తకరూపమున కొంతకాలముక్రింద ప్రచురింపబడినది." ఈ పుస్తకమందలి తొలిపలుకు శ్రీ వారి వేదరహస్య భావార్థమును విపులపరచుచున్నది. ఆ తొలిపలుకు భాగముల అనువాద మీ దిగువ వ్రాయుచున్నాము.

పూర్వకాలమందు వేదము పవిత్రజ్ఞాన సంపుటిగను, అనర్గళ కవితాధారా సమూహమనియు, ద్రష్టలు జ్ఞానులగుఋషుల ప్రోక్తమనియు పూజింప బడుచుండెను– ఋషులు తేజోభూయిష్టములగు మనస్సులలో, కేవలము మానసికముగా కాక, మహోత్కృష్టము, భూమము, సనాతనము అపౌరుషేయమగు సత్యమును దర్శించి మంత్రరూపమున నిర్మించిరి. ఈ మంత్రములు శక్తివంతములగు దార్శిక వాక్కులు. సాధారణముగాక దైవప్రేరితములివి. ఈ ప్రాజ్ఞుల కివ్వబడిన నామము 'కవి' యనునది. ఇదితర్వాత ఏకవికికూడ అన్వయించినది. కాని ఆకాలమందు సత్య ద్రష్టయనుభావమే కల్గియుండెను. వేదము వారిని 'కవయః సత్యశ్రుతః' సత్యమును

వినిన ద్రిష్టలని వర్ణించినది- వేదమే శ్రుతియనం బ ర గు చు న్న ది. అనగా అది దార్శనిక గ్రంధము. ఉపనిషత్ ద్రిష్టలు కూడ వేదములగూర్చి ఈ భావమునే గల్గి యుండిరి. పలుమారువారు వ్య క్తపరచిన సత్యములకు వేదమునే ప్రమాణముగా ప్రశంచించిరి. ఇవియును తర్వాత శ్రుతిగాఎన్నబడి పవిత్రశాస్త్రములు విధులుగ గణింప బడినవి.

కర్మ పరముగ వ్యాఖ్యానముచేయు యాజ్ఞికులు స ర్వ ము ను గాధకర్మ ప్రక్రియ యని విపులపఱచినను, పండితులు కర్మభాగము కర్మకాండయని, జ్ఞాన భాగము జ్ఞాన కాండయని విభజించి మొదటిదానిని ఋక్కులతోడను రెండవ దానిని ఉపనిషత్తులతోడను సమైక్యపఱచి నిర్ధారణచేసినను, బ్రాహ్మణములందు ఆమోదించి గ్రహింపబచిన ఈ సాంప్రదాయము నిలద్రొక్కుకొని యుండగలిగి నది. కర్మకాండచే జ్ఞానకాండ ఈ రీతి ముంపబడుటను ఉపనిషత్తులలో నొకదాని యందును గీతయందును గట్టిగా విమర్శింపబడినది. ఈ రెండును వేదమును జ్ఞాన సంపుటిగ నీక్షించుచున్నవి. వేదము ఉ ప ని ష త్తు ల తో కూడిన శ్రుతి సయితము ఆధ్యాత్మిక జ్ఞానమునకు ప ర మ ప్ర మా ణ మ ని యు అ ప్ర తి హ త ము లనియు పరిగణింప బడినవి.

ఇదంతయు గాథోత్ప్రేక్షలా? లేక నిరాధారము నిరర్థకమునైన సాంప్ర దాయమా? లేదా కొన్నికడపటి ఋక్కులలో కతాచితుగా గాన్పించు ఉన్నతా శయములందు ఈ సిద్ధాతము ప్రారంభించినదనుట నిజమేనా? ఉపనిషద్రచయి తలు ఋక్కులలో లేనియర్థమును వానియందారోపించి ఊహాగానము చే సి రా లేక అభూతకల్పన మొనర్చిరా? ఇప్పటి ఐరోపావిద్వత్తు అది అం తే న ని నొక్కి చెప్పుచున్నది. నూత్న హైందవ మానసము కూడా ఆదారికే తీ యు చు న్న ది. వేదఋషులు మంత్రిదష్టలేగాక యజ్ఞములందలి గాయకులు యాజ్ఞికులై వా రి గానములు సర్వజానీన క్రతువులందు పాడుటకును నిత్యాహ్నిక క్రియాపంత్రము సర్వదా సూచించుటకును, కర్మముల బాహ్యఫలములగు ధనము, సంపత్తు, శత్రు జయముల కోరుటకును వ్రాయబడిన వనుటయు ఈ భావమునకు తోడ్పడుచున్నది. మహాభాష్య కారులగు శాయనాచార్యలు, ఋక్కులకు క ర్మ ప ఱ మ గు నర్థము నొసంగి అక్కడక్కడ గాథేతిహాసభావముల తాత్కాలికముగా గైకొని, కర్మ

గాధల పరమగుయర్థము కనుగొనలేని యిక్కట్టులో పడినప్పుడు వానికిబదులు ఉన్నత భావమును బయలు పడనిచ్చినాడో యన్నట్లు ఉన్నతార్థమును అత్యరుదుగా ముందుకు తెచ్చినారు. ఇట్లైయ్యును వేదములయొక్క ఆధ్యాత్మ ప్రామాణ్యమును త్రోసివేయలేదు. ఋక్కులలో అతిశయార్థ మున్నదనుటను లేదనలేదు- ఈ కడ పరిణామము మన ఈ కాలమునకే వదలబడి పాశ్చ శాస్త్రజ్ఞులచే ప్రజా వ్యాపకము చేయబడినది.

ఐరోపాశాస్త్రజ్ఞులు కర్మపరమగు సాంప్రదాయమును గైకొని శాయనాచార్యుని మిగత భావముల త్రోసిపుచ్చి పదములుకు వారి స్వేఛ్ఛాను సారముగ వ్యుత్పత్త్యర్థముల నొసంగి, వేదఋక్కులకు తమస్వీయ ఊహార్థములనిచ్చి, చాలావరకు కల్పితము అశాస్త్రీయమగు నూతన వ్యాఖ్యలను గావించిరి. వేదములలో వారు చూడకోరినవి ఆకాలపు హైందవ చరిత్ర - సంఘ - సంస్థల, ఆచార, సంస్కృతుల చిత్రము. భాషల యందలి భేదముల నాధారము చేసుకొని ఉత్తర దిశనుండి ఆర్యుల దండయాత్ర జరిగినదను సిద్ధాంతము కల్పించిరి. ద్రావిడహిందూదేశముపై నిట్టి దండయాత్ర హిందువులు తమ సంస్కృతి సాంప్రదాయములలో నెరుగరు. వారి ఇతిహాసములలో గాని సంస్కరింపబడిన వాఙ్మయమునందుగాని కానరాదు. ఈ గణనమందు వైదికమతము సూర్యగాధలతో నిండిన ప్రకృతి దైవముల పూజయే యగుచున్నది. అయ్యది యజ్ఞాదిక్రతువులచే తను, అతిప్రాథమిక దశయందుండిన భావములతో నిండిన కర్మకాండ తోడను నివేదితమైనదగుచున్నది. ఈ సంస్కరింపబడని ఆదివాసుల ప్రార్థనలే ఇంత అతిశయోక్తిగా, పవిత్రవంతములు దైవచోదితమైన వేదమనబడు చున్నది.

భారతీయులు ప్రప్రథమున, భౌతిక జగత్కర్తలైన సూర్య, చంద్ర, పృథ్వీ, పర్జన్య, వాయు, తుపాను, మొదలగువానిని పవిత్రనదులను పూజించుచుండినది నిజము. ప్రాచీనకాలములో నాగరికత జాతులని పేరుమోసిన గ్రీసు, రోము దేశములలోకూడ, ఈ పూజావిధాన ముండెడిది. కాని, యీదేశములన్నిటిలోను, వారు యీదేవతల నున్నతప్రేరేపణలతోను, ఉన్నతాశయములతోను, పూజించెడివారు. మొదలు ఉషాదేవతగా పూజింప బడుచుండిన 'ఫల్లాస్ అదేని' అనుదేవత గ్రీసు దేశములో నూత్నభావముతో తరువాత

పూజింపబడి, యిదే దేవత రోము దేశీయులచే, జ్ఞానవిద్యల కధిష్ఠాన దేవతయగు 'మినర్వా' అనుపేరుతో, నుపాసింపబడెను. అటులనే, మొదలు నదీదేవతగా నుండిన సరస్వతీ, భారతీయులచే, సకల కళలకు, జ్ఞానమునకు, విద్యలకు అధిష్ఠాన దేవతగా పూజింపబడెను. ఇదేరీతి, గ్రీసుదేశములో, సూర్య దేవుడయిన 'అపాల్లో' కవితాదైవముగను, భవిష్యత్తును ప్రకటించు దేవతగనుమారెను; అగ్నిదేవుడైన 'హెఫేస్టస్' క్రతువుల దైవమాయె. ఈ విధానము, భారత దేశములో మధ్యకాలములో అడ్డగింపబడి, వైదిక దేవతలు, మనస్తత్త్వ కార్యముల నభివృద్ధి పొందినను, వారియొక్క భాషాలక్షణముల నట్లేనుంచుకొని, ఉన్నతాశయముల కొరకై. నూత్నదేవ సరళికి తావిచ్చిరి. వైదికకాలము నాటి, బృహస్పతి, శివ, లక్ష్మి, మహాదేవతలు, పౌరాణిక కాలములో, బ్రహ్మ, విష్ణు, రుద్రులయిరి. భారతదేశముతోని దేవతలు, గ్రీసు, రోముదేశములలోని దేవతలవలె పూర్తిమార్పు జెందక, వేదకాలపు ప్రాచీనదేవతలు పురాణకాలము నాటికి, చిన్నదేవతలయిరి. ఇందుకు కారణము ఋగ్వేదములోని దేవతలు, తమ ఆంతరిక, భాహ్యాలక్షణ విధానముల గోల్పోక ఆ రెండింటికిని ప్రాశస్త్యము కల్గి యుండుటయె.

ప్రాచీన జాతులలో నాగరికత పెంపొంది, మనోవికాసము వృద్ధిచెందు కొలది, యీపరివర్తనము ముఖ్యమాయెను. వీరు తమదేవతలలో, నూత్నభావములను, గుణములను చూడగల్గి, వీరియందు, ఆధ్యాత్మ గుణ, లక్షణముల చూచుచు, వీరిలో దివ్యరూపముల దర్శింపకల్గిరి. ఈ అంతర్దృక్కుకు కారణభూతులు, గుప్తతత్త్వజ్ఞులు, వీరు ప్రాచీనకాలమున, గ్రీసు, యీజిప్టు, ఛాల్డియా, పర్షియా, భారతదేశములలో నెక్కువ ప్రాముఖ్యతనొంది, తమ నిగూఢజ్ఞాన, తత్త్వముల విస్తరింపజేసిరి. నిన్నునీవు తెలిసికొమ్మనునది వారుబోధించిన సర్వోత్కృష్ట ధర్మసూత్రము. భారతీయులలోకూడ, ఆత్మాన్వేషణ నొకగొప్ప విధిగ చెప్పబడి, ఆత్మ నెఱుగుటొక గొప్పపదవిగ నెంచబడి యుండెడిది. భౌతిక జగత్తులో మనకు గోచరించు ప్రాముఖ్యత వస్తువులలో, ఆంతరిక శక్తులున్నవనియు, దివ్యజ్ఞాన, శక్తులచే వీనిని స్వాధీనపరచుకొని, మానవుడు తనకుకావలసిన సిద్ధుల బడయవచ్చునని, యీతత్త్వవేత్తలు చెప్పిరి. కాని, వీరు, యీ విద్యా విధాన

మతిగోప్యముగ నుంచుకొని, మఱుగుననే, తమశిష్యులకు, యింకను తగుమైన వారికి బోధించుచు, వెల్లడిచేసిరి. వీరు సంజ్ఞా పూర్వక సూచన విధానముల సృష్టించి, బోధితులైనవారికిమాత్రి ముపయుక్తమగు భాష నుపయోగించుతూ; అధికారము పొందిన వారికి మాత్రము రహస్యార్థముల వెల్లడి జేయుచు, ద్వంద్వార్థములతో నొప్పుభాషా కార్యకలాప సాంప్రదాయముల యేర్పరచు కొనిరి.

వేదఋషు లీసాంప్రదాయములో చేరినవారే. వీరి ఆధ్యాత్మిక తత్త్వ బోధనలను, వీరు సృజించిన ఋక్కులను, తమ ప్రియశిష్యులకు మాత్రము రహస్యార్థములతో బోధించుచూ వచ్చిరి. ఇందుకొరకు, సామాన్యులకు తెలి యని భాషాప్రయోగము లుపయోగించిరి. వేదములోని, దాదాపు నాల్గు వందల కంటె యెక్కువమాటల కర్థము యాస్కాచార్యులవంటి మహనీయునకే బోధ పడలేదట, ఉపనిషత్కాలపు ఋషులకు, ఆచార్యులకు కూడ, వేదభాష యందలి గుప్తార్థములు బోధపడనందున, వారు ధ్యాన నిమగ్నులగుటవల్లను; గురూపదేశము వల్లను, అందలి ఆంతరిక విజ్ఞానతత్త్వము తెలిసికొన కల్గిరి. కాని, ఆ తరువాతి పండితులు, యీ రహస్యజ్ఞాన బోధను తెలిసికోలేక, లేని పోని ఊహలకు లోనై వేదరహస్యముల కనుగొనలేక పోయిరి.

వేదఋషులు, వారి మంత్రములను, పరాచేతనలోని, నిగూఢ భూమికల నుండి ప్రేరేపింపబడిన స్వతః స్ఫురణవాక్కులని, తలంచు చుండిరి. ఈ మంత్ర ములు రహస్యజ్ఞాన పూరితములు. వేదములోని మాటల యొక్క నిజమైన అర్థము, వేదఋషికో, లేక గూఢతత్త్వజ్ఞునికో, తెలిసియుండెను. తదితరులకు వేదమంత్రములు తమ గూఢార్థము వెల్లడింపవయ్యె. మహర్షి వామదేవుడు, అతడు సృజించిన ఋక్కుల నొకదానిలో, ఋషిఅనబరగు వాని పల్కులు రహ స్యపువాక్కులు ("నిన్యావచాంసి,") అనియు, జ్ఞానికి లోనబోధించు విజ్ఞానవాక్కు ('కావ్యాని కవయేనివచనా') లనియు, చెప్పియున్నాడు. మహర్షి దీర్ఘతమసుడు, వేదఋక్కులను, "నాశరహిత నిర్వికార మహాకాశములో నున్నటువంటి మంత్రములనియు, వీనియందు దేవత లుపస్థితులైనారనియు," వర్ణించినారు. ఈ రహస్యము తెలియనివారికి ఋక్కులెందుకని (1. 164. 39) ఈ మహర్షి

నుడివినాడు. ఇంతేకాక వాక్కు వెలువడునట్టి నాలుగుభూమికల గురించి వీనిలో మూడు రహస్యములో దాగియున్నవనియు, నాల్గవది మానుష సంబంధమైన దనియు, దానినుండియే సాధారణవాక్కు బయలుపడుననియు, వేదములోని వాక్కు, భావము, ఊర్ధ్వభూమికలకు చెందినవనియు, (1. 164. 46) ఇంకొకచోట ఈ ఋషి సూచించినాడు. వేదవాక్కు, పరమమనియు, భాషయొక్క అత్యున్నత శిఖరమనియు, నిష్కళంకమగు నట్టిదనియు, సర్వోత్తమ మగునది యనియు, వేదఋక్కులలోనొకచోట వర్ణింపబడినది. (10. 71). ఈ వాక్కు అంత ర్హితముగనుండినదై, అచటనుండి వెలువడి ప్రకాశించు చున్నది. అది సత్యదర్శనము పొందిన ఋషులలో ప్రవేశించినది. వారిభాషయొక్క జాడ గుర్తెరుగుటవలన నది కాననగును. కాని, ఎల్లరు దీనియొక్క రహస్య తత్త్వమును తెలిసికొన జాలరు. సర్వులు దాని గూఢార్థమును ప్రవేశింపలేరు. దాని ఆంతరిక భావము తెలియని వారు కని - గుడ్డి, విని - చెవుడు వారగుదురు. అచ్చటచ్చట ఏ ఒకరికో వాక్కు సుందరముగా వస్త్రములు ధరించిన భార్య తన భర్తకుమాత్రమువలె, తననిజ రూపము వ్యక్తపరచును. ఇతరులు నావాక్కు అను కామధేనువుయొక్క క్షీరము నిలుకడగా చవిచూడలేక, క్షీరమివ్వని దాని వెంటవలె చరించు చుందురు. అట్టి వారికి నావాక్కు ఫల పుష్ప రహితమైన వృక్షము. ఇది చాల తేటగను, నిశ్చిత ముగనున్నది. దీనివలన నిస్సంశయముగా ఋగ్వేదము వ్రాయుకాలమందునుకూడ అందరికి వెల్లడికాని రహస్యభావ మున్నట్లు, ఋక్కులను గౌరవించిరి. ఆ పవిత్ర మంత్రములందు గూఢమైన ఆధ్యాత్మిక జ్ఞానము కలదు. ఈ జ్ఞానముచేతమాత్రమే మనుజుడు సత్యము నెరుగగలిగి, ఉన్నతతర స్థితికి ఉద్గమించగలడని చెప్పబడినది. ఈ నమ్మకము తరువాతకల్గిన సంప్రదాయముకాక, ప్రాయసః అందరి యందును స్ఫుటముగ, నుత్తములైన కొందరు ఋషులయందు అనగా వామదేవ, దీర్ఘతమసు లలో సహిత ముండెడిది.

ఆలా సాంప్రదాయము అపుడుండెను. వేదకాలములలో తర్వాతను అది ఉంటూనేయుండెను- వేదమునకు పలువిధ భాష్యలుండెనని యాస్కుడను చున్నాడు. యజ్ఞ క్రతుపరమగు అర్థమొకటి యుండెను, ఐతిహాసికగాథాత్మికము మరొకటి, వైయ్యాకరణశబ్దార్థ వేత్తలచే నింకొకటి, తార్కికులచే నొకటి,

ఆధ్యాత్మిక పరమగు వాఖ్యయొక్కటి. త్రైవిద్యయొకటి యుండెననియు దానం చేసి వేదఋక్కులకు యజ్ఞక్రతువిషయజ్ఞానము, దేవతలగూర్చిన జ్ఞానము ఆధ్యాత్మ జ్ఞానము అని మూడర్థము లుండెనని యాస్కుడు ఘోషించుచున్నాడు. కాని కడ పటిదే యదార్థమైనది. మనుజునకది లభించినపుడు మిగతరెండు తమంత తామే జారిపోగలవు. ఈ ఆధ్యాత్మభావమే ప్రాధాన్యమైనది. మిగిలినవి బాహ్యము అప్రాధాన్యము– ఆయనఇంకా ఇట్లనుచున్నాడు. "ఋషులు సత్యమును, ఋత మును, అంతర్దృష్టిచే ప్రత్యక్ష దర్శనము గాంచిరని–" తదనంతరము ఆ జ్ఞా నము, వేదమందలి అంతర్భావము బొత్తిగా క్షీణించినది. ఇంకా దాని నెఱింగిన ఋషులు శిష్యులకు దానినుపదేశించి కాపాడగలిగిరి. చిట్టచివరకు ఆ భావమును కనుగొనుటకు బాహ్యమానసిక సాధనములగు నిరుక్తాది వేదాంగముల సహా యము కోరవలసి వచ్చినది_ అప్పటికిని 'వేదముయొక్క నిజార్థము' ధ్యాన తప స్సులవలన ప్రత్యక్షము కాగలదని వారనుచున్నారు. ఈ సాధన సంపత్తి గల వారి కీబాహ్యోపకరణములనవసరములనుచున్నారు. ఇదంతయు స్ఫుటము నిర్దిష్టముగ నున్నది.

హైందవ వ్యుత్పన్నత, నాగరికత, మతము, తత్త్వ జిజ్ఞాస, సంస్కృతు లకు మూలము వేదమందలి రహస్యార్థ సాంప్రదాయమే యగుట ఐరోపి యనులను కొనుదానికన్న ఎక్కువ చారిత్రాత్మిక విషయముగ నున్నది. పందొమ్మి దవ శతాబ్దమందలి ఐరోపియా విద్వత్తు అనాధ్యాత్మిక కారణవాదము ప్రబలి యున్న కాలముందు వ్రాయుచూ జాతియొక్క చరిత్ర ప్రాథమిక అనాగరికత నుండిగాని అర్థనాగరికత నుండిగాని వృద్ధిపొందిన మొరటు సంఘజీవన మతము, మిథ్యాచార సమూహమనియు గ్రహించినది. ఇవన్నియు సంస్కరింపబడిన బాహ్యసంస్థల, నడవడుల, అలవాటుల, అభివృద్ధిద్వారా మఱియు మేధ, హేతు వాద, తత్త్వజ్ఞాన, వస్తుపరిజ్ఞాన శాస్త్రాభివృద్ధిచేతను సుస్పష్టము, సమంజసము, అధిక సమయోచితమగు బుద్ధివలనను వృద్ధిపొందు చున్నవని ఎంచబడుచున్నది. వేదమును గూర్చిన ప్రాచీనా అభిప్రాయము ఈ చిత్రముం దిముడజాలదు; అయ్యది పూర్వ మిథ్యాచార భావమందలి ప్రాథమిక తప్పుయొక్క అంశముగా గణింపబడుచున్నది. కాని ఇప్పుడు మనము జాత్యభివృద్ధిని గూర్చిన నిశ్చయభావ

మును నిరూపింపగలము- అతిప్రాథమిక దశయందుండిన ప్రాచీన సంస్కృతులు దరిమిలావృద్ధిగాంచిన యంశములను లీనముగాదాల్చి యుండినవి తమయందు. కాని ఆకాలపువిజ్ఞులు వస్తుపరిజ్ఞాన శాస్త్రవేత్తలు, తత్త్వజిజ్ఞాసువులు, కడు మేధాసంపన్నులు కాక రహస్యవేత్తలు, గుప్తవిద్యాపరులు, గుహ్యావర్తనులు, మతాన్వేషులు నైయుండిరి. వారన్వేషించినది పదార్థములవెనుక తెరమరుగున యున్నసత్యమునే, బాహ్యజ్ఞానమునుకాదు- శాస్త్రజ్ఞులు తత్త్వవేత్తలు తర్వాతవచ్చిరి. వీరికిముందు రహస్యవిదులుండి యుండిరి, పైథాగరస్సు ప్లేటో లవలె కొంతవఱకు తామే రహస్యవిదులును లేదా రహస్య విదులనుండి తమ భావములను గైకొనినవారు. హిందూదేశమందు తత్త్వజ్ఞానము రహస్యవిదులఅన్వేషణ మందుండి పెంపొంది వారి ఆధ్యాత్మభావముల నిల్పుకొని వృద్ధిపఱచి ఈవలి హైందవ ఆధ్యాత్మ యోగశిక్షలందు వారివిధానములు కొంతవఱకు నిలచినవి. వేదసాంప్రదాయము, వేదమందు రహస్యవిద్య గలదనుటయు ఈ చరిత్రాంశముకు సమంజసముగా యున్నది. హిందూసంస్కృతి చరిత్రలో తగుస్థానము వహించుచున్నది. హైందవ సంస్కృతికి వేదసాంప్రదాయము స్థిరస్థాయియై అనాగరికాదివాసుల కర్మతంత్రము మాత్రమే కాదనియు కేవల సాంప్రదాయమే కాక నిజమైన చరిత్రాంశముకూడ అగుచున్నది.

అయితే ఉత్తమాధ్యాత్మజ్ఞాన పదార్థమొందుండినను లేక ఋక్కులలో ఉన్నతాశయములతో నిండిన భాగములున్నను, ఇవి అతిస్వల్ప భాగములేయని యనుకొనవచ్చును- తక్కినదంత కర్మతంత్రము, ధ్యానసూత్రములు, యజమానికి సమృద్ధములగు గోవులు, అశ్వములు, వీరులు, ప్రజలు, అన్నము, సర్వవిధములగుసంపద, రక్షణ, యుద్ధమందువిజయము లోనగు భౌతికాశీస్సులు, లేక ఆకాశమునుండి వర్షమును గొనివచ్చుట, మేఘములనుండి అథవా రాత్రిపట్టునుండి సూర్య నిమరల స్వాధీనపఱచుకొనుట, సప్తనదులు స్వేచ్ఛందముగ ప్రవహించుట, దస్యులనుండి పశువులను మఱలించుట, లోనగు బాహ్యదృష్టికితోచు యజ్ఞఫలముల నొసంగనుద్దేశించిన దేవతాస్తుతులును అగుచున్నవి. ఋషులంతనేదో యొకింత ఆధ్యాత్మ రహస్యజ్ఞానమునుగల్గి ఆ కాలపు సామాన్య జన భావములనే ప్రబలముగ జెందియుండవలె- ఈ రెండంశములను వారు ఋక్కులలో

చక్కగా కలిపి యుండవలెను- సాంప్రదాయక వ్యాఖ్యయందు గోచరమగు అస్పష్టత, విచిత్ర విపరీత గజిబిజి యిదియే కొంతవఱకు కారణముకాగలదు. కాని ఉన్నతభావములు కడువిశేషముగ విపులముగ కన్పించినయడల, గుహ్య భావములను సూచనల నంగీకరించు పలుఋక్కులు అత్యధికసంఖ్యగల మంత్రము లుండెనేని చివరకు కర్మతంత్ర పరమగు భాహ్యవివరములు తరుచుగ రహస్య వేత్తలచే నిరంతరము వాడబడినట్లు సాంకేతిక రూపముదాల్చినట్లు స్థిరపడినచో, ఋక్కులందా యర్థమిచ్చు లనేకములగు స్పష్టసూచనలు, తేటయగు వివరణలు సయితములుండెనేని అంతయు మారుచున్నది. బాహ్యాంతరము లైన ద్వంద్వార్థ ములతో నిండిన రహస్య విద్యావేత్తల ఉత్కృష్ట గ్రంథము మనకు ప్రత్యక్ష మగుచున్నది- సాంకేతికములు అంతరార్థాసూచనలను గుప్తవిద్యాజ్ఞానముల భావములను కలిగియున్నది. ఋగ్వేదమంతయు, స్వల్పసంఖ్యగల కొన్నిమంత్ర ములు మినహా అంతరార్థమందు అట్టిగ్రంథ మగుచున్నది. అంత బాహ్యార్థము కేవలము తెరయే కానేరదు. ఋషులు ఋక్కులను మంత్రములని అంతర్విష యములకేగాక బాహ్యావిషయములకును శక్తివంతములైన వాక్కులని గణించెడి వారు. కేవలము ఆధ్యాత్మ విషయమైన గ్రంధము ఆధ్యాత్మ సూచనలనె బోధిం చును. కాని ప్రాచీనరహస్యవిదులు మంత్రవేత్తలు. అనగా వీరు అంతస్సాధనలచే 'బాహ్యాంతర ఫలితముల సాధించగలమని నమ్మినవారున్నూ, చింతనము వాక్కు- ఇవి సర్వవిధఫలములను సాధింపనోపినవనియు, వేదమందు సామాన్యముగ కన్పించు 'మనుష్య దైవిక' మనువచనమును విశ్వసించినవారును అగుచున్నారు.

వేదములో ఈ గుప్తార్థరూప మెచటనున్నది? ఋషులచేత వాడబడిన వాక్యములు, సూత్రములు, ముఖ్యకీలక స్థానములలోనుండు పునాదిరాళ్ళవలె వారి సిద్ధాంతనిర్మాణమును భరించుచున్నవి. వానికి ఒకటేయగు నిష్కపటమగు నర్థమునిచ్చుటచేతనె కనుగొన నగును. అట్టివాక్యములలో నొకఉత్కృష్టమైనది 'ఋతం సత్యం' అంతర్విదులు అన్వేషించు ముఖ్యవిషయ మీసత్యమె;ఆధ్యాత్మ లేక అంతరంగిక సత్యము, మనయొక్కసత్యము పదార్థములసత్యము ప్రపంచ సత్యము దేవతల సత్యము మనమగు సర్వమునకు పదార్థములకు వెనుకనున్న సత్యమునే ముఖ్యముగ వెదకువిషయమై యుండెను. వ్యాఖ్యాన కారుని యొక్క

యనుకూలమునుబట్టి, ఊహనుబట్టి కర్మపర వ్యాఖ్యానమందు ఈ శ్లేషపదమును యనేకయర్థములలో నిర్వచించిరి. సత్యము, యజ్ఞము, జలము, నొకరిచేత అన్నమని యర్థము చేయబడెను. ఇక ఇతరములగు యనేకార్థముల చెప్పనే పని లేదు. మనమారీతి చేసిన వేదమునకు వ్యవహారములో నిశ్చయమైన రూఢి యుండదు. మనము సమంజసముగ ఒకేఉత్కృష్టభావము సదానిచ్చిన అద్భుతము, విస్పష్టమగు ఫలితము బయలుపడును. అదేవిధముగ వేదమందలి యితర యనాది వాక్యముల నాదరించి, వానికి, సామాన్యమైన, స్వాభావికమగు, నిష్కాపట్యమైన యర్థమిచ్చి, కర్మపరమగు యర్థముకొరకు వానిభావముతో క్రీడించక సర్వవా సమంజసమగు యర్థమివ్వవలెను. "శ్రవసు" "క్రతు" మొదలగు ముఖ్యమైన పదములకు, వానియందలి సాధ్యత ప్రకారము ఆత్మపరముగా యున్నవి. నిస్సంశ మముగా కొన్నిభాగములందు వేదము అగ్నిని 'క్రతుర్ హృది' యనుటవల్ల ఈ ఫలి తము ఇంకను స్పష్టము వ్యాపకము విస్తారము యగును. దీనికితోడు మనము ఋషులు కొన్నివేళలయందు స్పష్టముగాచెప్పిన వాక్కులయందలి సూచనలను- వారి గుర్తులయొక్క ఆంతరంగిక భావములు అదేభావముతో పలుకూడ తెల్పు గాథలు, యందలి పాత్రలను- వృత్రాసురనిపై విజయము వృత్రాసులతో యుద్ధము, ఆయనశక్తులు, సూర్యుని దొరకించుకొనుట- జలములను, గోవులను దస్యులనుండి తీసికొనుట; వీనినీ భావముతో విశదీకరించిన ఋగ్వేద మంతయు ఒకానొక, ఆంతరంగిక, గుప్తమై గూఢమైన ఆత్మసిద్ధాంత స్వరూపమగును. అన్ని పురాతన దేశములందుకూడ అంతర్వేదులు సూచించినట్టి ఈనిజము వేదములలో మాత్రముమనకు మిగిలియున్నది— అచ్చటది ఉద్దేశపూర్వకము గానే తెరచాటున దాచబడినది. కానినాతెర మనము మొదలూహించునంత దట్ట మైనదికాదు. మననేత్రముల నుపయోగము మాత్రిచేసి నంత నాతెర యదృ శ్యమై వాక్యరూప సత్యము మనముందు నిలుచును.

వేదఋక్కులలోని అనేక చరణములు అనేకఋక్కులు సహితము, గుప్తభావములు కల్గి, అంతరార్థముతో నిండియున్నవి. వేదఋషి, అగ్నిదేవు నుద్దేశించిపల్కు "తనస్వగృహములో ప్రకాశించు సత్యముయొక్క పాలనకర్త" అను వాక్కున్ను; మిత్ర, వరుణదేవతలను, యింకా నితరదేవతల నుద్దేశించిపల్కు

"సత్యమునకు ప్రత్యక్షులు, సత్యమును పెంపొందించు వారును," "సత్యములో జనించినవారును" అను వాక్కులున్ను, విషయముల కావలనుండు ఆంతరిక సత్యమునుగురించి చెప్పబడిన గుప్తకవితా ధారలుగాని వేరొండు కాదు. ఇవి ఋషిచే, బాహ్యజగత్తులో మనముచూచు అగ్నినిగురించుగాని, క్రతుసంబంధమైన యజ్ఞము విషయముగగాని, చెప్పసంగతులు కావు. మరియు, ఋషిపుంగవుడు 'సరస్వతి' నుద్దేశించి చెప్పు "సత్యవాక్కులను స్ఫురింప జేయునదియు, సత్యతలంపులను మేల్కొలుపు నదియు, సత్యధనము కల్గినదియు" "ఆమె ఆ మహార్ణవమును తెలియజేసి, మన తలంపులనన్నిటిని వెలిగించు" అను మాటలన్నియు నదీదేవతనుగురించి చెప్పపల్కులుకావు. మరేమన, యీ సరస్వతి, లోన జ్ఞానము కలిగించునట్టిన్ని, సత్యము మనలోనిర్మితము చేయునట్టిన్ని, తలంపులలోనికి వెలుగు తెచ్చునటువంటిన్ని, దివ్యప్రేరణలు కల్గించు నటువంటిన్ని, శక్తిగా మనము తెలిసికొన వలెను.

యజ్ఞమనునది, లోని అంతఃక్రతువుయొక్క బాహ్య చిహ్నము; ఇయ్యది, అమర మర్త్యులమధ్య జరుగు ఆంతరిక సాటాబేరముగ నున్నది. మనుజుడు తన కున్నది దేవతల కర్పించుటయు, వారిందుకు ప్రతిఫల పూర్వకముగా మర్త్యులకు అశ్వశక్తులను, వెలుగు మందలను, వీరుల బలమును, సమకూర్చుచు దాస్యుల తోను, వృత్రాసురులతో మానవులుసల్పుయుద్ధములో జయముచేకూర్చుటయు, అగుచున్నది. యాజ్ఞికుడుప్రార్థించుగోవులు, అశ్వములు మొదలగునవి, భౌతికధనముకాదు. కాని ఆంతరిక యజ్ఞక్రతు మూలకముగ కల్గు, విజ్ఞాన ధనరూపకమగు భావములు తేజస్సు, శక్తి మొదలగునవి. ఒకానొకచోట ఒక ఋషి యిట్లు పల్కినాడు. "రాత్రింబగళ్లు, ఆద్యంతరహిత సోదరీమణులు, మా సిద్ధరూపకమగు పనుల పేకను యజ్ఞరూపకముగా నేయు సంతోషకర సాలెస్త్రీలు"; గూఢార్థ పూరితమైన వాక్కులివి. ఇంకొకచోట ఋషిపల్కిన "బుద్ధి (ధీః) అను కామధేనువు, మాకోర్కెలను స్వర్గలోకములలో అమరులయందు వర్థిల్లచేయుచున్నది. ఇది తనంతకదే, వివిధ ధనములు మాకిచ్చు" అను వాక్కులు తేజోవంతమైనవి. వేద ఋషులు కోరినది సామాన్యమైన భౌతిక అశ్వ, గో, ధనముకాదు. ఈ ఆవుల, గుఱ్ఱముల, యితరధనములయొక్క అర్థమొకింత తెలిసికొందము.

సంస్కృత భాషలోని పదములకు వివిదార్థములుండు. ఈ పదములను సవ్యముగా ఇంగ్లీషులోనికి భాషాంతరీకరణ మొనర్చుట కష్టతరము. వేద ఋషులు తాము రచించిన ఋక్కులలోని అర్థమునని గోప్యముగ నుంచుటకు, ద్వంద్వార్థము కల్గిన మాటలను, సాంకేతిక పదములను వాడియున్నారు. ఇందుకు కొన్ని ఉదాహరణములు : 'గో' (ఆవు) శబ్దమునకు వెలుగు లేక జ్యోతిః కిరణ మనికూడ అర్థములు. ఇది ఋషుల పేర్లనుండికూడ విశదమగు. 'గోతమ' ఋషి అనగా, మహాతేజోమయుడని అర్థము. 'గవిష్ఠిర' ఋషి అనగా, వెలుగులో దృఢమగు నిలుకడ కలవాడని అర్థము. వేదములో చెప్పబడిన 'గోవులు' సూర్యునిమందలు; యివి జ్యోతి, జ్ఞాన, సత్యమయ సూర్యభగవానుని కిరణములు. ఈ అర్థము స్పష్టముగా వేద ఋక్కులనుండి గ్రహించనగు. అటులనే యజ్ఞ క్రతువులలో నుపయోగించు సాధనములలో నొకటైన 'ఘృతము' (నెయ్యి) అనుపదమున కింకొక అర్థము, 'ప్రకాశ' మనికూడ నగు. 'ఘృ' అను మూలపదమున కర్థము 'ప్రకాశింపచేయు'. ఇంద్రుని గుఱ్ఱములు 'ఘృతస్నూః' అని వర్ణింప బడినవి. అనగా నెయ్యితో స్రవించు చున్నవని. అంటే, యీ అశ్వములు పరుగెత్తుతుంటే నెయ్యిచుక్కలు కారుచుండినవని కాదు. 'తలంపు' అను పదము 'ఘృతము' నకు పోల్చబడి 'ధీయమ్ ఘృతాశిమ్' అని చెప్పబడినది: అనగా 'ప్రకాశమగు తలంపులు' అనే అర్థముతో ఋషులు వాడిన మాటలివి.

ఒకానొక ఋక్కులో అగ్ని దేవుని ఋషి ప్రార్థించుతూ 'ఘృతప్రుషా మనసా' 'నెయ్యిపోయు మనస్సుచేత, నైవేద్యమును ముంచివేయు మనియు, అందుకు ఫలితముగా, మూడుస్థానములు (మూడు స్వర్గలోకములు) మాకు ప్రత్యక్షమగునట్లు చేయుము' అని పల్కినాడు. కాని యీ నెయ్యిపోయు మనస్సేమి? నెయ్యిపోయడంవల్ల దేవతలు, స్వర్గములు, ప్రత్యక్షమగుటెట్లు? కాని యీ పదముల అంతరార్థము తెలిసికొనినచో, ఋషియొక్క భావము తేటబడు. ఋషి వాడిన పదములకర్థము, 'జ్యోతిలో ప్రవహింపజేయు మనస్సు' ని. ఋషి సంప్రదించినది, సామాన్యమానవ పురోహితుని గురించిగాని కాదు. ఆయన వాక్రుచ్చినది అంతఃస్థిత వెలుగునుశోధించి, కవిఃక్రతువును గురించి చెప్పినమాటలివి.

ఋషులు సత్యదర్శనము చేసినవారు. త్రైజ్ఞానికులు, వారి ధ్యానావస్థలో

అంతరార్థములతో కూడిన సాంకేతిక ప్రతిబింబములను చూచుచు, యీ దర్శనము నకు ముందుగాని, ఆవలగాని, విజ్ఞానానుభూతి పొందుచూ, వారు చూచిన రూప ములకొక నిర్దిష్ట ఆకార మిచ్చుచుండిరి. కనుకనే ఋషి ఏకసమయమున, తనలోని దివ్యానుభూతిని, ప్రత్యక్షమైన బింబములోని అంతరార్థమును, గ్రహింప కల్గి, ఆయన తనలో పరిశుద్ధమైనర్చు జ్యోతిప్రవహించుటయు, యీ ఘృతజ్యోతిని అధ్వ ర్యుడు అంతర్నివేదన మొనర్చుటయు, నుపలబ్ధి పొందకల్గెను. ఇయ్యది పాశ్చా త్యులకు వింతగాతోచు. కాని భారతీయులకిది సహజ సమంజసానుభూతి.

ఈ విధముగనే వేదఋషులు ప్రార్థించిన అశ్వము, శక్తికి చిహ్నమగుచు ఆధ్యాత్మికబలము, తపోశక్తిని సూచించు. వేదఋషులు యీ అశ్వముల కొరకు అనగా, యీ దివ్యశక్తులకొరకై ఋక్కులలో ప్రార్థన చేసిరి. అట్లనే వీరు 'అపత్యం' (పుత్రుల) కొరకు ప్రార్థించినారంటే, సాధారణ కొడుకులకనికాదు; వీరు కోరినది జ్ఞానముతో కూడిన పునర్జన్మము. 'అగ్ని దేవుడే మన పుత్రుడు, మన కర్మనెర వేర్చు శిశువు. దివ్య సత్యధామము చేరుటకు ప్రజ్వలింపజేయు విశ్వాగ్ని' అను మాటల కర్థము వేరు. ఇదే విధముగా 'నీటి' పదముకూడ వేదములో అంతరార్థయుతముగ నున్నది. 'సలిలమ్ అప్రకేతమ్' అను పదములు వాడబడినవి. భగవానుడు సృష్టికిముందు అచేతనాసముద్రము (సలిలమ్ అప్రకేతమ్) నందుండి, పిమ్మట తన మహత్త్వముచే వెలువడి ప్రభవించినట్లు చెప్పబడినది. వీనిని, అనగా ఈ ఊర్ధ్వ ప్రవాహములను, సరస్వతీదేవి స్వతఃస్ఫురణ కిరణముల ద్వారా, మన కెరిగించు. (ప్రచేతయతి కేతునా). సప్తనదులను 'స్వర్గమునుండి ప్రవహించు నీటిధార లనియు, వీని విడుదలచే, స్వర్గలోకములకు మార్గము విదితమగుననియు' ఋషి వర్ణించెనిందు. వృతాసురిని వధించుటచే ఇంద్రుడు వర్షము విడుదలచేయునని ఋషి వాక్కు. ఈ వర్షము స్వర్గపువాన. ఈ నీటి విడుదలకథ, అంగీరస ఋషులు దేవ తలతో కూడ పర్వతగుహనుండి, సూర్యుని ఆయనయొక్క గోమందలను త్రిప్పు కొనివచ్చుకథ, ఇవి వేదములోనున్నవి. దీనికంతయు అర్థమేమన: అంతర్నిహితజ్యోతి స్సత్యములను, వీనికి ప్రభువైన విజ్ఞానమయ ఆదిత్యపురుషుని తెలిసికొనుటయే. అసురశక్తులయిన వృతాసుర దస్యులను, ఇంద్రవజ్రాయుధముతో చంపి, వీరు దొంగి లించిదాచిన వెలుగు గోమందను జ్యోతిర్మయ శక్తులను, మరల త్రిప్పుకొని

వచ్చి, సంపాదించడమే. దస్యులనగా దొంగలనియు, నాశముచేయు వారనియు, తిమిరశక్తులనియు వేదఋషుల అర్థము.

సూర్యునిగూర్చిన సాంకేతిక విషయమై ఐదవ మండలమందలి అతిము ఖ్యము, ప్రాశస్త్యమైన మంత్రమిచ్చట చెప్పనగును. ఏలన అయ్యది వేదకవుల ఉత్కృష్ట రహస్య సాంకేతికమును విపులపరచుటయే గాక, ఉపనిషద్రచయితలు ఏలా ఋగ్వేదమును, అర్థము చేసుకొనినది, తమ పూర్వీకుల జ్ఞానము దైవప్రేరితమని వారెట్లునమ్మినది కానవచ్చును. "సత్యముచే కప్పబడిన సత్యమొండు కలదనిన్ని, కాడిగట్టిన సూర్యాశ్వముల నక్కడ, వారు విడచుకొన్నారని, పదినూర్లొకటిగా నిలిచినవని, తదేకం బచ్చోనుండెనని, వేదవాక్కు పలుకుచున్నది. ఈ భావము లను ఉపనిషత్ద్రష్ట ఏరీతి నుడివినది, ఈ గుహ్యోపలబ్ధినెట్లు తన వైఖరికి సూటిగ మార్చుకొనినది, కేంద్రి సూర్య సాంకేతికమును చేకొని భావమందేరహస్య మును చొరనీక చెప్పినది గమనార్హము. 'సత్యముయొక్క ముఖము సువర్ణమయ పాత్రముచే కప్పబడినది, ఓ పూషన్! దానిని సత్యఋత దర్శనమునకై తొల గింపుము; ఓ పూషన్, (పోషించువాడా) ఏకైకద్రష్టా, ఓ యమ, ఓ సూర్య భూతపిత పుత్రా, నీ కిరణములను సంధానమొనర్చి దగ్గచేర్చుము; నే నా తేజమును, అతి సుందరమైనదాని (సుభగమైనదాని) రూపమును చూచు చున్నాను. ఈపురు షుడెవ్వడో, అతడు నేనైయున్నాను' అని ఉపనిషద్వాక్యము పలుకు చున్నది. సువర్ణమయమూత వేదమంత్రమందు చెప్పబడిన ఋతం సత్యమును కప్పినమూత యని అర్థము. దైవముల శ్రేష్ఠతమ రూపములు సూర్యుని సుందరతమ రూప ముతో సరిపోవుచు, ఎల్ల బాహ్య తేజముకన్న గొప్పది, వేరైనదగు ఉత్తమ తేజ మది. 'ఆతడే నేనను' ఉపనిషత్ మహావాక్యము 'తదేకం' ఆ ఒకటి యను ఋగ్వేద మంత్రముకు సరిపోలుచున్నది. 'ఒకటిగానిలుచు పదినూర్లు' (శాయనా చార్యులు సూర్యకిరణము లనుచున్నారు, అది వాస్తవార్థ మనవచ్చును) సూర్య ప్రార్థనయందలి 'తన కిరణముల సంధాన మొనర్చి దగ్గరచేర్చుము నీ ఉత్తమ రూపముచూచుటకు' అను పునరోక్తియే యగుచున్నది. రెండు వాక్యములందును వేదమందు సతతము, ఉపనిషత్తులలో పలుమారు సూర్యుని, పరమసత్య జ్ఞాన ముల దైవముగను, ఆయన కిరణములా పరముసత్య జ్ఞానములనుండి వెలువడు

తేజముగను, గ్రహింపబడినది. ఈ ఉదాహరణమును బట్టి – ఇట్టివనేకములున్నవి – ఉపనిషత్ ద్రష్టలు ప్రాచీన వేదార్థమునుగూర్చి, మధ్యకాలపు అపారపాండిత్యము గల క్రతుతంత్రపర వ్యాఖ్యాతలకన్న నిజతరభావమును, ఈ కాలపు అధిక విభిన్న మనస్కులగు యైరోపా విద్వజ్జనముకన్న అత్యధిక నిజతర భావమునుగల్గి యుండి రనుట విస్పష్టము,

వేదములో ధీః, ధియాః, అనగా తలంపు, తలంపులని అర్థము. కాని యీ పదము 'యజ్ఞ' మని పండితులచే వాడబడినది. అట్లనే 'కేతు' అను మాటకు కిరణమని అర్థము. కాని యిది వేదములో 'బుద్ధి' 'విచక్షణా శక్తి' అను అర్థములలో వాడబడినది. 'క్రతు' వనగా 'పని' 'యజ్ఞ' మని సామాన్య అర్థములు. అయితే యీ పదమునకు 'తెలివి' 'తీర్మానించుశక్తి' 'ఇచ్ఛాశక్తి' అను అర్థములతో వేదములో నుపయోగింపబడినది. అగ్నిదేవుడు 'కవి-క్రతు' వనియు, 'క్రతుహృది' అనియు వర్ణింపబడినాడు. 'శ్రవస్' అను పదము 'యశస్సు' 'ఆహారము' అని భాష్యకారులచే ప్రయోగింపబడినది. కాని యిది మూలపదమైన 'శ్రు' అను దానినుండివచ్చి, దీనికి సరిఅయిన అర్థము 'వినబడిన వస్తువు' లేదా 'వినడంద్వారావచ్చు జ్ఞానము' అనియు నగు. వేదఋషులు తమ్ముగురించి 'సత్యమును వినినవారు' (సత్యశ్రుతాః) అని వర్ణించుకొన్నారు. వేదఋషులు 'శ్రవాంసులను' పైకి క్రిందికి తీసికొని పోవచ్చునని చెప్పిన ప్రయోగము ఆహారమునకుగాని, కీర్తికిగాని అన్వయించదు. కాని సత్యపథమునకు తీసుకొనిపోవు 'దివ్యశ్రుతి' 'శ్రవాంసి' అనియు, సత్యమును అధోలోకమునకు కొనివచ్చు 'శ్రవాంసి' అనియు మనముచేయు అర్థము, వేదఋషులు వాడిన పదములకు సమన్వయించు.

జ్యోతిస్సత్య అమృతత్త్వముల కనుగొనుటయే వేదచింతనయొక్క ముఖ్యాంశము. సామాన్య జీవనమునకంటె గభీరమగు సర్వోత్తమ సత్యమొండు కలదనియు, మానవ తెలివికన్న ఉన్నతమగు వేరొక వెలుగున్నదనియు, యిది దివ్యప్రేరితమై, అతీతమనోభూమికల నుండి స్ఫురించి ప్రవహించు ననియు, అమృతత్త్వము కొరకు జీవుడు ఊర్ధ్వగతి నొందవలెననియు, అదియే అమృత సత్యములకు మార్గమనియు, (సాపంథా ఋతమ్ అమృతమ్) సత్యములోజన్మించి, అందులో

పెరిగి, పరమాత్మలోను సత్యప్రపంచములోను నివసించుట ధర్మమార్గ మనియు, వేదఋషులు వివరించిన ఋక్కులలోని సారము.

ఈ ప్రపంచము పాపములతోను, తప్పులతోను ( అనృతస్య భూరేః ) నిండి యున్నది. సత్యలోకము ( సదనమ్ ఋతస్య ) ఋతముయొక్క యిల్లు, ఏ ప్రదేశ ములో సత్యచేతన ( ఋత చిత్ ) కలదో, అట్టిచోటుదర్శించి బృహత్, సత్యఋత ముల కనుగొనుటే దేవతల మార్గము. మన జీవితము సురాసురుల కదనరంగము. మనము దేవతల నాహ్వానించి తమోరిపుల నిర్మూలించి, సత్యధారలను ( ఋతస్య ధారాః ) మనలో ప్రవహింప జేసికొన వలెను. అంతఃక్రతు రూపమున, మంత్ర మూలమున దేవతల నన్వేషించి, వారికి క్రతువులోని నైవేద్యముల నర్పించి, యీ విధముగ గమ్యస్థానమునకు బాట నిర్మింప వలయు. మనకున్న దానిని ఆత్మ సమర్పణముచేసి దివ్య సత్యములను, లోనికవగాహన మొనర్చుకొని, దివ్యసత్య మున జననమొంది, సరియైన తలంపులు, సరిఅయిన వివేచనాశక్తి, సరియైన కర్మ, వీనితోకూడి సత్య పథములోనికి మనము స్థాపితము కావలయును. మన యజ్ఞ, క్రతువాక ప్రయాణముగను, తీర్థయాత్రగను, యుద్ధముగ నున్నది. అగ్ని దేవునిని నాయకునిగను, త్రోవచూపించు వానిగ ముందుంచుకొని, యీ వెలుగుయొక్క సహాయముతో దేవయానము సల్పనగు. మర్త్యవిషయానీకము యీ పావకునిచే స్వర్గములోని అమరతత్త్వముగ మార్చబడి, దివ్యవస్తువుల మనలోని కవతరణ మొనర్చు. తుదకు భగవాను డొక్కడేయనియు, ( ఏకమ్ సత్ ) ప్రతి దేవతయందు అందరు దేవతలున్నారనియు, ప్రతి దేవతయు 'తత్ సత్యమ్ ' అనియు తెలిసికొని, సచ్చిదానందమయులు కావలయు. వేదములోని రహస్యమిదియ యింతవఱకు.

# స్వప్నము.

ఒకదరిద్రుడు చిమ్మచీకటి గదిలో కూర్చొని తన శోచనీయమైన స్థితిని గురించియో, భగవానుని రాజ్యమందలి అన్యాయములను గురించియో తలపోసి కొనుచుండెను. దురభిమానపరతంత్రుడై అతడీలా చెప్పెను. "లోకులు కర్మవాదమునకు ప్రాశస్త్యమిచ్చి భగవంతుని సత్కీర్తిని రక్షింపజూతురు. గతజన్మపాపము, ఈజన్మయందు నా దుర్దశకు కారణమయ్యేనేని, నేనంత పాపినై యుంటినేని, నిశ్చయముగా నీజన్మమునందుకూడ నామనస్సునందు పాపచింతనల స్రోత నిరంతరము ప్రవహించుచునే యుండవలెనుగదా! ఇంత ఘోరపాతక మనస్సు ఒక్కనాటిలో నిర్మలము కాగలదా? మఱి, యీ వీధిలో అతనిని చూడుము! అతడు మూడుగవ్వలకు పనికిరానివాడై యుండియు, వానికెంత ధనము! ఎంత అధికారదర్పము, ఎంత వెండి బంగారము! ఎందరు దాసదాసీజనులు! కర్మఫలమే సత్యమైనయెడల వాడు పూర్వజన్మమునందు నిశ్చయముగా జగద్విఖ్యాత సాధువై యుండవలెను, లేదా మహాత్ముడై యుండవలెను. కాని దాని చిహ్నమాత్రమైనను, ఈజన్మయందు వానిలో కనపడుటలేదు. ఇంతటి నిష్ఠుర నీచ మోసగారి మనుష్యుడు ప్రపంచమునం దెక్కడను గానరాడు. కర్మవాదమంతయు భగవంతుని ఠక్కరివిద్యగా నున్నది; మానవమాత్రుని హృదయమును దృఢముగ నుంచుటకై పన్నినపన్నుగడయది. శ్యామసుందరుడు చాలగొప్పచతురచూడామణి; నాచేతికి దొరకకున్నాడు. అతని చమత్కారమంతయు అందులోనే యున్నది; లేదేని తగిన శిక్ష నొసంగి అతని చాతుర్యమునంతయును పోగొట్టెదను."

ఇట్లాలోచించుచుండునంతలో, అతని చీకటి గదియందు అతిశయోజ్జ్వల భావతరంగమొకటి హఠాత్తుగా ప్రవహించి, మరల తత్క్షణమే ఆ భావతరంగము

అంధకారమునందు లీనమైపోయెను. తన ముందర నొక సుందర కృష్ణవర్ణ బాలకుడు చేతియందు దీపము పట్టుకొని నిలుచుండుట కనబడెను; ఏమియు మాట్లాడక నవ్వుచుండెను. శిరస్సునందు మయూరమకుటము, పాదములయందు నూపురములు ధరించిన యాతనినిచూచి, చేతికి పట్టుబడుటకు శ్యామసుందరుడే స్వయముగా వచ్చినాడా యనితోప నాదరిద్రుడు సిగ్గుపడెను; ప్రణామము చేయవలయునను తలంపొకసారి కలిగెను. కాని బాలకుని నవ్వుముఖము చూచి ప్రణామము చేయుటకును ఇష్టముపోకుండెను. అంత్యమున వానినోటినుండీవాక్యములు బయల్వెడలెను,—
"అరే, కన్నయ్యా, నీవెందులకు వచ్చితివి?"

బాలకుడు నవ్వి జవాబిచ్చెను,— "నీవు నన్ను పిలువలేదా? ఇప్పుడిప్పుడే నన్ను కొట్టవలెనను కోరిక నీ మనస్సునందుండలేదా! అందుచే నేను వచ్చి నీచే జిక్కినాను; లేచి కొట్టుట కారంభించుము."

దరిద్రుడు మరింత సిగ్గుపడెను. భగవానుని కొట్ట తలంచి యుండినందుల కను తాపము కలుగలేదు, కాని, ఇంతసుందర బాలకుని స్నేహము చేయుటకు బదులు కొట్టుట మంచిదికాదని తోచెను. బాలకుడు మరల చెప్పెను,—"ఎవ్వరు నన్ను జూచి భయపడక, నన్నుసఖునివలె జూతురో, స్నేహభావముతో నిందింతురో, నాతో క్రీడించుట కిచ్ఛగింతురో, వారు నాకు చాల ప్రియులు. నేను, క్రీడకొఱకే జగత్తును సృష్టించినాను. ఈ క్రీడయందుపయుక్తముగానుండు సహవాసులను నేను సదా వెతుకుచుందును. కాని, అన్నా, అట్టి స్నేహితులెక్కడ దొరకుదురు? అందరికి నాపైన కోపమే, అందరును నాపైన దావాలు వేయుచు, దానము మానము, ముక్తి, భుక్తి మొదలగు ననేక కోరికలను కోరుదురు. కాని నన్ను మాత్రమెవ్వరును కోరరు! ఎవ్వరేదికోరిన వారికదినేను యిచ్చెదను. ఏమి చేయవచ్చును; వారిని సంతోషపెట్ట నవసరమున్నది; లేనిచో వారు నా ప్రాణము నపహరింపనెంతురు. నీకేమైనను కావలసిన చూడుము. నీ యభిలాషను పూర్తి చేసికొనుటకు నన్ను పిలిచియున్నావు. మంచిది, నేనుకూడ నీ కొరడా దెబ్బలు తినుటకువచ్చియున్నాను– "ఏ యథా మాం ప్రపద్యంతే, తం స్తథైవ భజామ్యహం" అవును, ఈ ప్రకారము నీవు చేయుటకు ముందు నానోటినుండి నీవేమైన వినుట కిచ్ఛగింతువేని నీకు నాకార్య ప్రణాళికను జూపించెదను, ఏమి నీ కది యిష్టమేనా?"

హరిమోహనుడు,—"నీ కట్లు చేయుట కిష్టముండెనా? కాని నీవు వట్టి మాటలతో గడుపనున్నట్లు నాకు కనపడుచున్నది; నీవంటి చిన్నబాలుడు నాకుపదేశ మివ్వగలడన్న నేనెట్లు విశ్వసింతును?"

బాలకుడు మరల నవ్వి చెప్పెను—"మంచిది, రమ్ము చూడుము, నేనేమి చేయగలుగునది." ఈ మాటలు చెప్పి, శ్రీకృష్ణుడు హరిమోహనుని తలపై చేయినుంచెను. హఠాత్తుగ దరిద్రుని సమస్త శరీరమునందును విద్యుచ్ఛక్తి ప్రవహింప జొచ్చెను; మూలాధారమున నిద్రించుచున్న కుండలినీశక్తి, అగ్నిమయ సర్పిణీరూపముతో గర్జన చేయుచు, వాని బ్రహ్మరంధ్రమునుండి పరుగిడెను; వాని మస్తిష్కము, ప్రాణశక్తియొక్క తరంగమునందు మునిగిపోయెను. స్వల్పకాల ములో, అతని చుట్టియున్న యింటిగోడలు దూరము తొలగిపోయినట్లును, నామ రూపజగత్తు తనను విడిచినట్లును, అనంతమునందు తాను లీనమైనట్లును యుండెను. హరిమోహనుడు బాహ్యజ్ఞాన శూన్యుడయ్యెను. అతనికి మరల తెలివి కలిగి నంతనే, అతడు వేరు అపరిచిత గృహమునందు బాలకునితో కూడి నిలిచి యుండి నట్లును, ఒక వయోవృద్ధుడు దవడపై చేతినుంచికొని, నొక గద్దియపై కూర్చొని ప్రగాఢమైన చింతలో మునిగియుండినట్లు కనబడెను. ఘోరచింతయందు, నిక్కృత హృదయ విదారక నిరాశచే నుండు అతని మలినముఖమును చూచి, తాను గ్రామములో చూచుచుండిన వృద్ధుడు, సర్వాధికారి ఆతడే యను విశ్వాసము కలుగకుండెను. అంత్యమున అత్యంత భయభీతులతో బాలకుని చూచి చెప్పెను—

"అరే కన్నయ్యా, నీవేమి చేసితివి! చోరులవలె, ఘోరరాత్రియందు పరుల యింటిలో ప్రవేశించితిమి. పోలీసులు వచ్చి మనలను పట్టవచ్చును; మఱియు కొట్టి కొట్టి మన ప్రాణములను తీయవచ్చును. 'తీన్ కాడీ' శీలుని ప్రతాపము నీకు తెలియదా?"

బాలకుడు నవ్వి చెప్పెను,—"బాగుగా తెలియును; దొంగతనము నా పూర్వ వృత్తి; పోలీసులు నాకు బాగుగా తెలిసినవారు, నీవు భయపడవద్దు. నీ కిప్పుడు సూక్ష్మదృష్టి నిచ్చెదను; వృద్ధుని మనసులో జరుగు కార్యవిధానమునంతను తెలిసికొనుము. "తీన్ కాడి" శీలుని ప్రతాపము నెఱిగినట్లే నా ప్రతాపమును తెలిసికొనుము."

ఇప్పుడు, హరిమోహనుడు వృద్ధుని మనస్సును చూచుటకు సమర్థుడయ్యెను. వృద్ధధనాఢ్యుని నగరు నానాప్రకార ఆక్రమణములచే విధ్వంసమగుచుండునట్లును, అతని తీక్ష్ణప్రకాశమాన బుద్ధియందు భీషణమూర్తులు, పిశాచములు, రాక్షసులు మొదలగు వారు ప్రవేశించి అతని సుఖమును కొల్లకొట్టుచుండిరి. వృద్ధుడు, తన పుత్రులలోనెల్ల ప్రియపుత్రుడగు కడపటి వానితో కలహించి వానిని యింటినుండి బయటకు వెళ్ళగొట్టియున్నాడు; ఇప్పుడు వాడు తన ప్రియపుత్రుని పోగొట్టుకొని శోకమునందు మునిగి మరణాతురుడైయున్నాడు; మరియు, క్రోధము, గర్వము హతము వాని హృదయమును బంధించి, పహరాచేయుచున్నవి. అతని హృదయమందు, క్షమ ప్రవేశించుట కంతరాయ మేర్పడినది. అతని కూతురొక్కతె, దుశ్చరిత్రకలది యను కళంకము కలుగ నుండుటచే తాను ప్రేమించుచుండిన కూతురును తన యింటినుండి తొలగించి ఆమెకొఱ కేడ్చుచున్నాడు. తన బిడ్డ నిర్దోషిణియని యావృద్ధునికి తెలియును, కాని సమాజ భయము, లోకలజ్జ, అహంకారము, స్వార్థము, అనుచరులయందలి అతిశయగౌరవము, అను నీకారణములచే తానేమిచేయలేకుండెను; చేయుటకు ఇష్టముకూడ కలుగకుండెను; మధ్య మధ్య, మృత్యువు, పరలోకచింతన, వృద్ధునికి, కఠోరభీషణ రూపమును దాల్చుచుండెను. మరణచింతయను తెరవెనుక యమదూతలు తొంగితొంగి చూచుచు, వాని కవాటమును తట్టుచుండిరి. ఆశబ్దము విని నపుడంతయు, భయ వ్యాకులములచే, వృద్ధుడు అఱచుచు లేచుచుండెను. ఈ భయంకర దృశ్యమును జూచి హరిమోహనుడు భీతిచెందెను; అతడు బాలకుని దిశకుజూచి "అరే, కన్నయ్యా, ఇదియేమిటి వృద్ధుడు పరమసుఖియని నేను తలంచియుంటిని."

బాలకుడు—"ఇదియును నాప్రతాపమే. చెప్పుము ఎవ్వరి ప్రతాప మెక్కువ, ఆ వీధియందలి 'తీన్ కౌడి' శీలునిదా, లేక వైకుంఠవాసి శ్రీకృష్ణునిదా? హరిమోహనా, చూడుము; నా స్వాధీనములోకూడ, పోలీసులు, పహరా, గవర్నమెంటు, శాసనము, విచారణలు యున్నవి. నేనున్ను రాజునై ఆట ఆడించుచున్నాను. ఈ ఆట నీకిష్టముగ యున్నదా?"

హరిమోహనుడు,—"లేదురా, బాబూ, నాకీయాట చాల చెడ్డదిగా యున్నది. నీకది బాగుగా కనపడుచున్నదా?"

బాలకుడు నవ్వి, జవాబు చెప్పెను,—"నాకన్నిమాటలు యిష్టమే; కొరడా దెబ్బలు కొట్టుటకును తినుటకును ఇష్టమే. ప్రజలు సామాన్యముగ బాహ్యమునే చూచెదరు; అంతరమును చూచుటకువలయు సూక్ష్మదృష్టి, వికాసము వారికింకను కలుగలేదు. అందుచేతనే నీవు దుఃఖపరుడవనియు, తీక్కాడీశీలుడు సుఖపరుడనియు చెప్పుచుంటివి; ఈ వృద్ధునికి పార్థివవస్తులేవియును కొదువలేదు; ఐనను ఈ ధనవంతుడు నీకంటె ఎంత దుఃఖమును బాధను పడుచున్నాడు. ఇట్లెందుకు జరుగుచున్నది? నీవు చెప్పగలవా? దాని సమాధానమిది,— మనస్సునందే కష్టమున్నది, మనస్సునందే దుఃఖమున్నది. సుఖదుఃఖములు మనోవికారములు మాత్రమే, ఎవ్వనిదంతయు తనదికాదని తలంచునో, ఎవ్వని సంపద, విపత్తుమాత్రమేమై యున్నదో, ఆతడిచ్ఛయించెనేని ఆవిపత్తుకు అంతరముననే పరమసుఖము నాతడు పొందగలడు. మరియు నీ వేవిధముగా నీరసపుణ్యమునందు దినమంతయు గడుపుచు, కేవల దుఃఖచింతన చేయుచున్నావో, అట్లేయీతడుకూడ తన కాలమునంతయు నీరస పాపమునందు గడుపుచు కేవల దుఃఖచింతనయందే యున్నాడు. అందువలన పుణ్యముచే కేవల క్షణిక సుఖమును, పాపముచే కేవల క్షణిక దుఃఖమును, లేక నీరస పాపపుణ్యములచే క్షణిక సుఖదుఃఖములను పొందుచుందురు. ఈ ద్వంద్వములయందానందము లేదు. ఆనందము యొక్క నివాసమునకు బీగము నాయొద్దనున్నది. ఎవ్వరు నాయొద్దకు వచ్చెదరో, నా ప్రేమపాశముచే బద్ధులగుదురో, నన్ను సాధింతురో నాపై దౌర్జన్యము సలిపెదరో, అత్యాచారముచేయుదురో, వారు నా ఆనందముయొక్క బీగమును తీసికొనగలుగుదురు.

హరిమోహనుడు మిగుల తత్పరత్వముతో శ్రీకృష్ణుని వచనములు వినుచుండెను. బాలకుడు మరల చెప్పెను,—"హరిమోహనా, ఇంకను చూడుము; ప్రీతిలేని పుణ్యము నీయొద్ద నీరసమై పోయినది; మరియు ఈ సంస్కార ప్రభావమును విడుచుట, ఈ తుచ్ఛాహంకారమును జయించుట నీకు మహా కఠినములుగా నున్నవి. ఇదేవిధముగా, పాపముకూడ వృద్ధుని యొద్ద నీరసమై పోయినది, మరియు సంస్కార ప్రభావముచే నతడు వానిని విడువలేకున్నాడు. జీవితమునందు నరక బాధను బడుచున్నాడు. వీనినే "పుణ్యబంధనము, పాపబంధనము" అని చెప్పుదురు. అజ్ఞానజనిత సంస్కారము, త్రాడువలె ఈ బంధనముల ముడివేయును.

కాని వృద్ధునియొక్క ఈ నరకబాధ గొప్పశుభావస్థగా యున్నది; దానినుంచి వానికి పరిత్రాణము మంగళము కలుగును. ”

హరిమోహనుడింతవరకు బాలకుని మాటలు నిశ్శబ్దముగా వినుచుండి ఇప్పు డాతనికిట్లు చెప్పెను;—ప్రియమగు కన్నయ్యా, నీ మాటలు చాల తీపిగా యున్నవి; కాని వానిచే నాకు సమాధానము కాలేదు. సుఖదుఃఖములు మనో వికారములు కావచ్చును; కాని బాహ్యావస్థయు వానికి కారణముగా యున్నది; విచారించి చూచిన క్షుధాజ్వాలచే ప్రాణము పరితపించునపు డెవ్వడైన పరమ సుఖము ననుభవింపగలడా? రోగముచే ఆకలిచే శరీరము బాధపడునపుడు ఎవ్వ డైన నీమాట నంగీకరింపగలడా? ”

బాలకుడు చెప్పెను,—“ రమ్ము, హరిమోహనా, అదియునుకూడ నీకు చూపెదను. ”

ఇట్లు చెప్పి, బాలకుడు హరిమోహనుని తలపైన మరల చెయ్యిపెట్టెను. చేతి స్పర్శ కలిగినంతనే, హరిమోహనునికీ దృశ్యము కనపడెను. వృద్ధుని గృహమ దృశ్యమై, దాని స్థానమున నొక నిర్జన, రమ్య, పర్వత, వాయుసేవిత, శిఖ రముపై నొక సన్యాసి ఆసీనుడై ధ్యాననిమగ్నుడై యుండుట చూచెను. అతని పాద ముల ముందర నొక వ్యాఘ్రము రక్షకునివలె పరుండియుండెను. వ్యాఘ్రమునుజూచి హరిమోహనుని గాళ్లు భయముచే కదలకుండెను. కాని బాలుడాతని లాగుకొని సన్యాసి కడకు దీసికొనిపోయెను; బాలకుని సంగమునందు నిస్సహాయుడై అతడు నడచెను. అప్పుడు బాలకుడు, హరిమోహనుని చూడుమని చెప్పెను.

హరిమోహనుని కన్నులయెదుట, సన్యాసి మనసు తెరువబడిన లెక్క పుస్తకమువలె నున్నది. అందులోని ప్రతిపుటయందు శ్రీకృష్ణుని పేరు వెయ్యి సారులు లిఖింపబడియున్నది. సన్యాసి నిర్వికల్ప సమాధిద్వారమునుదాటి సూర్య ప్రకాశమునందు శ్రీకృష్ణుని సంగమునందు క్రీడసల్పుచున్నాడు. కొన్నిదినముల నుండి సన్యాసి అన్నపానీయములు లేక కాలము గడుపుచు రెండురోజులనుండి ఆకలి దప్పులచే శరీరబాధ అతనికి అధికమైయుండెను. ఇట్లుచూచి హరిమోహనుడు చెప్పెను,—“ అరే, కన్నయ్యా, ఇదియేమి; మహాత్ముడు నిన్నింత ప్రేమించు చున్నాడు. ఐనను, అతడు క్షుధాపిపాసల ననుభవించు చున్నాడు; నీకు సాధా

రణునికి గల విచారముకూడలేదు. ఈ నిర్జన వ్యాఘ్రసంకుల అరణ్యమునందతనికి ఆహారము నెవ్వరిత్తురు." బాలకుడు చెప్పెను,—"నేనిచ్చెదను. మరియొకవింతను చూడుము. "అంతట, హరిమోహనుడు చూచుచుండగ, వ్యాఘ్రము లేచి తన కాలిగోర్లచే సమీపముననున్న వల్మీకూటమును నొక్క దెబ్బకొట్టెను. అది పగిలి, ఆ మంటికుప్పనుండి వేలకొలది చెదలు బయటకు వచ్చి కోపముతో సన్యాసి శరీరముపై పరుగిడుచు కరువ చొచ్చెను. సన్యాసి ఆ యవస్థయందు ధ్యానమగ్నుడై, నిశ్చలుడై కూర్చొనియుండెను. అప్పుడు బాలకుడు మధురస్వరముతో సన్యాసి చెవిలో "సఖే" యను శబ్దము పలికెను. సన్యాసి కన్నులు తెరచెను; తోలు దొల్త, ఆ చెదలుకాటు, మోహజ్వాలామయిదంశనానుభవముగ స్ఫురింపలేదు; కాని, తొల్లి బృందావనమునందు శ్రీరాధికా చెవియందూదబడిన శబ్దము విశ్వవాంఛిత చిత్తమును హరించు పిల్లనగ్రోవిశబ్దము, తానప్పుడప్పుడే వినుచుండి నట్లుకనబడెను; దీనితర్వాత, ఆ వేలకొలది చెదలు తన శరీరమును కఱచుచుండు టను గురించిన తెలివి, తన శరీరము వంకకు, ఆకర్షింపబడెను. సన్యాసి తన ఆసనమునుండి కదలక, విస్మయపూర్వక మనస్సుతో, నిట్లు చెప్పెను,—"ఇది యేమి? ఇట్లెప్పుడును జరుగలేదే! ఓహో, శ్రీకృష్ణుడు నాతో చేరి క్రీడించు చున్నాడు, క్షుద్రసమూహకీటక రూపమున నన్ను కఱచుచున్నాడు." కీటకములు కఱచుబాధ సన్యాసికి ప్రాణికముగా స్ఫురింపలేదనియు పైగావాని కాటుబాధ తీవ్ర శరీరానందమునే అనుభవింపజేయుచుండెననియు, ఆ యానందముతో, శ్రీకృష్ణనామమును పాడుటకును, తాళము వేయుటకును, నాటకమాడుటకును ప్రారం భించుటయు, చెదలు అతనినుండి దిగి మంటిలోనికి పరుగిడుటయును, హరిమోహ నుడు చూచి ఆశ్చర్యముతో నడిగెను "అరే, కన్నయ్యా, యీమాయయేమి?" బాలకుడు తాళము వేయుచు, ఒంటికాలమీద రెండడుగులు వేసి నాట్యమాడుచు, నడచుచునిట్లు చెప్పెను,—"నేను జగత్తుయొక్క ఏకమాత్రుడనగు ఇంద్ర జాలికుడను. ఈమాయను నీవు అర్థము చేసికొనజాలవు. ఇదినా పరమ రహస్యము. చూడుము. బాధయందు కూడ సన్యాసి నన్ను స్మరించుచున్నాడు; ఇంకను చూడుము."

కొంతసేపటికి సన్యాసి సహజస్థితికి వచ్చి కూర్చుండెను. అతని శరీరమున ఆకలి

దప్పి బాధానుభవము, ప్రారంభమాయెను; అందుచే కలుగు వికారములను శరీరము అనుభవించుచుండినను, అతడు వికృతుడుకాలేదు, లిప్తుడుకాలేదు. ఈ విషయమును హరిమోహనుడు కనుగొనెను. ఈ సమయమునందు కొండపై భాగమునుండి, ఎవ్వరో వంశీరవ స్వరముతో "సఖే" అని యఱచుటచే, హరిమోహనుడు విస్మితుడయ్యెను. అది శ్యామసుందరుని స్వరమైయుండెను. ఆతర్వాత కొండశిఖరము వెనుకనుండి ఒక సుందర కృష్ణవర్ణ బాలకుడు స్థాలియందు ఉత్తమ ఆహారమును పండ్లను తీసికొని వచ్చుచుండెను. హరిమోహనుడు హత బుద్ధియై శ్రీకృష్ణుని వంకకు చూడసాగెను. బాలకుడుకూడ తన ప్రక్కనసే నిలిచియుండెను. వచ్చుచుండు బాలకుడుకూడ అవికల శ్రీకృష్ణుడేయైయుండెను. రెండవ బాలుడక్కడికి వచ్చి సన్యాసికి వెలుతురుచూపి "చూడు, ఏమి తెచ్చి యున్నా" నని చెప్పెను.

సన్యాసి నవ్వి యిట్లు మాట్లాడెను,—"వచ్చినావా? ఇన్నాళ్లవరకు ఆకలి లోనేయుంచితివా? మంచిది, ఎప్పుడువచ్చితివో, అప్పుడునాయొద్ద కూర్చొనితినుము.

సన్యాసియును బాలుడును, ఆస్థాలియందుండు బండారమును తిన నారంభించిరి. ఆహారము సమాప్తమైనంతనే, బాలకుడు స్థాలిని తీసికొని అంధకారమునందు విలీనమయ్యెను. హరిమోహనుడేదోదో అడుగనుండెను, కాని శ్రీకృష్ణుడక్కడనుండలేదు; సన్యాసియునులేడు, పులియునులేదు, పర్వతమును లేదు. ఇప్పుడతడు గొప్పమనుష్యుని మహలునందున్నాడు. అమితధనైశ్వర్యములు, స్త్రీలు, పరివారము, బ్రాహ్మణులకు భిక్షుకులకు నిత్యదానము లిచ్చుటయు, త్రికాల సంధ్య జరుపుచుండుటయు, శాస్త్రోక్త ఆచార విచారమును యత్నపూర్వకముగ రక్షించుచుండుటయు, రఘునందనుడు ప్రదర్శించిన మార్గమున నడచుచుండుటయు చూచెను. అక్కడ, ఆదర్శపితరుడు, ఆదర్శభర్త, ఆదర్శపుత్రులు నిత్యజీవితమందలి తీవ్రవేదనల ననుభవించుచుండిరి. కాని, ఆరెండవ క్షణమునందే, ఆ భద్రమహలునందు నివసించువారి అంతరమున లేశమాత్రమైన సద్భావము కాని ఆనందముకాని లేకుండుటచూచి భయభీతుడయ్యెను; వారు యంత్రమువలె బాహ్యాచారములను రక్షించుటయే పుణ్యమని తలంచుచుండిరి. ఇట్టి జీవనముచే, హరిమోహనునికి మొదలు ఎంతఆనందము కలిగెనో, అంతబాధయిప్పుడు కలిగెను.

అతనికి దప్పికయినట్లును, నీరుదొరకనట్లును, ధూళిఎగురుటచే నోటిలోనికి పోవు నట్లును చూచి, భయమయ్యెను. అందుచే, అక్కడనుండి పరుగెత్తి వేరొక గ్రామమునకు పోయెను. అక్కడనొక ప్రకాండమేడముందర, అపూర్వ జన సంఘమును, వారొసంగుచుండిన ఆశీర్వాదకోలాహలమును గాంచెను. హరిమోహను డాజన సమూహమునకు కొంచెముదగ్గర పోయెను; అక్కడ తీర్కాడీశీలుడు వసారా యందు కూర్చొని రెండు చేతులతో దానము చేయుచుండెను. అక్కడనుండి నిరాశపడి వాపసుపోయినవారేలేరు. హరిమోహనుడు నవ్వి, అటుయిటునడచుచు, నిట్లుతలంచెను,—"ఈస్వప్నమెట్టిది! తీర్కాడీశీలుడుకూడ దాతయా? ఆశ్చర్యము." ఆతర్వాత నతడు తీర్కాడీశీలుని మనస్సును స్పష్టముగా చూచెను. ఆ వృద్ధుని మనస్సు నందు, లోభము, ఈర్ష్య, కామము, స్వార్థము మొదలగు గుణాలోపములు, కుప్రవృత్తులు ధ్వనించుచుండెను. పుణ్యముకొఱకును, యశముకొఱకును వాంఛితుడై, గర్వమునకు వశుడై, తీర్కాడీశీలుడు తనభావములను దాచియుండెను, కాని హృదయమునందవి లేకపోలేదు. ఈ సమయమునందే హరిమోహను నెవ్వరో పట్టుకొని పరలోకమునందు నడిపించుచుండిరి. హిందువులయు, క్రైస్తవులయు, ముసల్మానులయు, యునానీలయు, స్వర్గనరకములను, పరలోకమునందు చూచి వచ్చెను. దానితర్వాత అతడిట్లు కనుగొనెను – తనయింటియందే, తన పూర్వ పరిచిత చినిగిన చాపమీద చినిగినమైలగుడ్డతోనుండిన పాన్పుపై, తాను కూర్చొని యుండెను; తనయెదుట శ్యామసుందరుడు నిలుచుకొనియుండెను. బాలకుడిట్లు చెప్పెను,—"రాత్రిచాలకాలము గడచినది. నేనింటికిపోని యెడల నాయింటివారు నన్ను బెదరించెదరు. తన్నెదరు. కనుక అధికముగా మాట్లాడుట కవకాశము లేదు, సంక్షేపముగా, నింతమాత్రము చెప్పెద వినుము. నీవు స్వర్గనరకముల జూచితివి; అవియన్నియు స్వప్నజగత్తుయొక్క కల్పనచే సృష్టిరైనవి. మనుష్యుడు మరణానంతరమున స్వర్గమునకు లేక నరకమునకు పోయి గతజన్మముయొక్క భావమునక్కడ అనుభవించును. నీవు పూర్వజన్మమునందు పుణ్యవంతుడవై యుంటివి, కాని ఆ జన్మమునందు నీహృదయమున ప్రేమకు స్థానము దొరకలేదు; మానవునికాని భగవంతునికాని నీవు ప్రేమించలేదు. అందుచే ప్రాణముత్యజించిన తర్వాత స్వప్నజగత్తునందు గొప్పమానవుని మహలునందు వాసముచేసి పూర్వ

జీవితభావములను భోగము చేసితివి; మరియు భోగము చేయుచు చేయుచు, ఆ భావములనుండి నీవలసట చెందితివి; నీప్రాణము వ్యాకులము చెందసాగెను; అక్కడ నుండి విడిచిపోయి ధూళిమయనరకమునందు వాసముచేయ నారంభితివి; అంత్యమున జీవితముయొక్క పుణ్యఫలము. ననుభవించి, మరల నీజన్మమును పొందితివి. జీవనమందు చిన్నచిన్న నైమిత్తిక దానములను, నీరస బాహ్యవ్యవహారములను తప్ప ఎవ్వరియొక్క లేమిడినిదూరము చేయుటకుగూడ నీవేమియు చేయలేదు. అందుచే, నీకీ జన్మమునందింత అభావము కలిగియున్నది. ఈసమయమునను నీవు చేయుచుండు నీరసపుణ్యమునకు కారణమిదియే. కేవల స్వప్నజగత్తుయొక్క భోగముచే పాపపుణ్యములు క్షయమొందవు; వాని సంపూర్ణక్షయము, కర్మఫలమును పృథ్వియందనుభవించుటచే కలుగును. తీఙకాడీశీలుడు గతజన్మమునందు దానకర్ణుడైయుండెను. వేలకొలది జనుల ఆశీర్వాదముచే, ఈ జన్మమునందు లక్షాధికారియయ్యెను. అతని కేవస్తువును కొదువలేదు; కాని అతనికి చిత్తశుద్ధి కానందున అతృప్త కుప్రవృత్తులు, పాపకర్మల ద్వారా, అతడీసమయమున తన్నుదా తృప్తిపఱచుకొనవలసిన అవసరము వచ్చినది. కర్మవాదమిప్పుడైనను నీకర్థమైనదా? ఈ కర్మవాదము బహుమానదండనములు కావు; ఇది అమంగళము ద్వారమున అమంగళమును మంగళముద్వారమున మంగళమును సృష్టియగుటకుగల ప్రకృతి శాసనము. పాపము అశుభము; అందుచేదానివలన దుఃఖము కలుగుచున్నది; పుణ్యము శుభము; అందుచేదానివలన సుఖము కలుగుచున్నది. ఈ వ్యవస్థ చిత్తశుద్ధికొఱకు, అశుభవినాశము కొఱకు జరుగుచున్నది. చూడుము, హరిమోహనా, ఈ పృథ్వి, నావిచిత్రమయి జగత్తుయొక్క ఒక చిన్న అంశము మాత్రమేమైయున్నది. మరియు కర్మద్వారమున అశుభనాశనము కావించుటకు మీరిక్కడ జన్మపొందుదురు; తర్వాత పాపపుణ్యముల సేతలనుండి పరిత్రాణమును పొంది ప్రేమరాజ్యమునందు పదార్పణమొనరించునపుడు, మీరీకార్యములనుండి విముక్తులగుదురు. వచ్చేజన్మయందు నీకు ముక్తికలుగవచ్చును. నా ప్రియసోదరియగు శక్తిని, ఆమెసహచరియగు విద్యను, నీయొద్దకు పంపెదను; కాని చూడుము, ఒక నియమము మాత్రము అందున్నది. నీవు నాలీలయందు సహచరుడవుకావలెను, ముక్తుడవై యూరక మాత్రముండకూడదు. మరి, అది నీకిష్టమేనా?"

హరిమోహనుడిట్లు చెప్పెను,—"అరే, కన్నయ్యా, నీవు నాకు చాలఉపకారము చేసితివి; నిన్ను కౌగిలించుకొనుటకు చాలఇష్టమగుచున్నది; ఈ జీవితమందు నాకిప్పుడేవాసనయు లేకుండపోవుచున్నవని నాకర్థమగుచున్నది."

బాలకుడు నవ్వుచూ చెప్పెను,—"హరిమోహనా కొంచెమేనియు అర్థము చేసికొంటివికదా?" హరిమోహనుడు జవాబుచెప్పెను,—"ఎందుకర్థముకాలేదు." దీని తర్వాత కొంచెమాలోచించి మరల చెప్పెను. "అరే కన్నయ్యా, నీవు నన్నింకను మోసగించియుంటివి. అశుభమును నీ వేల సృష్టించితివి. దీని విషయమున, నీవేమియు ప్రతిపాదనచేయలేదు. ఇట్లు చెప్పి, అతడు బాలకుని చెయ్యి పట్టుకొనెను. బాలకుడు తనచేతిని విడిపించుకొని, బెదరించుచు, నిట్లు చెప్పెను— "దూరముండుము; వహ్వా, ఒక గంటకాలములోనే, నాసమస్త గుప్త వచనములను వినుటకు కోరుచున్నావో?" ఇంతమాత్రము చెప్పి, బాలకుడు దీపమును హఠాత్తుగా ఆర్పివేశి, హరిమోహనునుండి కొంచెముదూరము పోయి నవ్వుచూ చెప్పెను, "చూడుము, హరిమోహనా, కొఱడాతో కొట్టుట పూర్తిగా మఱచితివి; అందుచే, నీ కౌగిలిలోనికి నేనురాలేదు. నీవు బాహ్యదుఃఖముచే క్రుద్ధుడవై నన్ను, బాగుగా కొట్టుటకేల ప్రయత్నించలేదు! నీయందు నాకు లేశమాత్రమైనను విశ్వాసములేదు."

హరిమోహను డంధకారమునందు తనచేతిని చాచెను; బాలకుడు మరింత దూరము పోయియిట్లు చెప్పెను—"లేదు, ఈ సుఖమును నీకు మరియొక జన్మమునందు బాకీయుంచి విడిచెదను. మంచిది నేనింక పోయెదను."

ఇట్లుచెప్పి, బాలకుడు చీకటిరాత్రి యందదృశ్యుడై పోయెను. హరిమోహను డాతని నూపురధ్వనిని వినుటకు లేచెను; లేచి యిట్లు తలంచెను, "ఎట్టి స్వప్నము చూచితిని! నరకమును స్వర్గమును చూచితిని. మరియు భగవానుని "నీవు" అని చెప్పితిని, చిన్నబాలకుడని తలంచి నిందించితిని, దూషించితిని! పెద్దపాపమును కొడిగట్టుకొంటిని! కానిమ్ము, ఏదిఎట్లైనను, ఒక పూర్వాభూత శాంత్యానుభవము నాప్రాణమునందు స్థిరపడినది." హరిమోహను డిప్పుడు ఆ కృష్ణవర్ణ బాలకుని యొక్క మోహినీమూర్తిని ధ్యానించుచు, మధ్యమధ్య, "ఎంతటి సౌందర్యము, ఎంతటి సౌందర్యము" అని చెప్పసాగెను.

శ్రీ అరవిందులవారి లేఖలు :

# ఎరుక

ఎరుక, ప్రజ్ఞావిహీనమైన జడప్రపంచమందు, అకారణమగు విపరీతచేష్టయో, అకస్మాత్తుగా వృద్ధినొందునదియో లేక తాత్కాలికముగా నుండుసంఘటనయో కాదు, దానిఉపరిభాగమందది యట్లగు పడవచ్చును. పదార్థవిజ్ఞాన శాస్త్రము దానిపేరు సూచించినరీతిగానే బాహ్యదృష్టిలో నిలిచిపోవుచున్నది. అది బాహ్య దృష్టిలో మొదలుపెట్టి అంతకన్న, ఆంతర దృష్టి లేనందున ఆయాధారము మీదనే పరిగణించుచుండును. కాని బాహ్యదృశ్యముమాత్రము పదార్థములసత్యముకాదు. అవిసత్యాంశములైనను పూర్ణసత్యములెన్నటికికావు, సత్యాన్వేషణయందు వస్తువుల బాహ్యదృష్టికి దూరమై లేక యావలనిలిచి చూచినగాని పదార్థములలోని సత్యము గ్రహించుటకు వీలుకాదు. ప్రథమ దృశ్యములునమ్మరానివిగాయుండును. విద్యుచ్ఛక్తి సత్యమునెరుగవలెనన్న మెరుపుతీగను, మేఘములో తటాలున ఆకస్మికముగపొంగు అగ్నిస్వభావమని తెలుసుకొనినచాలదు. ఆ మెరుపుతీగెను బహిర్గతముచేసిన శక్తియొక్క నిజమును తెలియుటకు చాలదూరముగను లోతుగను పరిశోధించవలెను. ప్రజ్ఞలేక ఎరుక ఇదేవిధముగా అవిద్యాంధకారములనుండి తటాలున వెలువడిన చైతన్యమనవచ్చును. ఈ విపరీతాత్భుతశక్తి నిజస్వభావము తెలియుటకు బాహ్యమున వ్యక్తమగు స్వరూపమును దాటి యావలికి పోవలయును.

నిశ్చేతనమైన భౌతికప్రపంచమం దుండుటవలన విపరీతమనవలెను. దాని యొక్క ప్రతీకారము ప్రతిఫలము ప్రతిక్రియ విధి ఇవన్నియు అద్భుతాశ్చర్యములు.

మానసిక విజ్ఞానశాస్త్రము, ఇప్పటి దానివిధానముపట్టి, పదార్థవిజ్ఞాన శాస్త్రముయొక్క పొడిగింపుమాత్రముగ యున్నది. అది వస్తువులయొక్క సత్యాన్వేషణలో క్రిందినుంచి పైకి పరిశోధించ ప్రయత్నించును. జడమగు పృథివి దానికి ప్రథానపునాది. అచ్చటది యన్వేషించి దాని యధోభాగమునుకనుగొనిన

దనుకొనును. అందువలననే మధ్యభాగమును ఊర్ధ్వభాగమునుకూడ గ్రహించిన దనుకొనెను లేకయనుకొనును. ఇదొక స్వాభావసిద్ధమగు పొరపాటు. ఎరుకయొక్క సత్యము దాని ఊర్ధ్వభాగమందు మధ్యభాగమందు అధోభాగమందుకూడ కలదు. ఎరుక యధోభాగమునుకాని మధ్యభాగమునుకాని మనము చేరగనే మరచిపోవు దుము. అదేవిధముగా ఊర్ధ్వభాగము చేరకమునుపే మరుపువచ్చును.

జడ పదార్థములలోకూడ ఎరుకయున్నది. కానియదిమూర్ఛయందుండుటచే మన పరిశోధనలకు ప్రతి క్రియలుండవు. అందువలన మన పరిశోధనలు సఫలములు కావు. జడపదార్థములు మానసము పొందక ప్రాణచేతనను నొందినప్పుడుకూడ మన విమర్శనలకు అప్పుడప్పుడు జవాబుఇచ్చినను వానిని మనము గ్రహించలేము. పశువులలో నున్న మనస్సుకూడ యీ మొదటిమూర్ఛనుండి సగము మేల్కొనినది మాత్రమే. మనుజునియందుకూడ ఎరుక అవిద్యయందే ప్రారంభమైనది. అందు వలన దాని వైఖరి, సిద్ధాంతము, దానిని గురించిన మన పరిశీలనంతయు జ్ఞానాన్వేషిత మగు నవిద్యమాత్రమే. దీనినిపట్టి మనము ఎరుకయనే నిజమునసేమియో దాని మూలమెద్దియో దాని ఉత్కృష్టసాధ్యములెవ్వియో, దానికిపరిమితి యున్నదేదియో, లేక యది యపారానంతమైనదోయని తెలిసికొనజాలము. ఈయవిద్య యొక్క యసంపూర్ణతనుండియు యజ్ఞానమునుండియు దాటి నొకసాధ్యమగు ఊర్ధ్వ భాగమందునో, లేక గుప్తమగులోతునందునో, లేక దాచబడిన మధ్యస్థానమందునో, చేరియచ్చట మరుపులేక తమస్సులో మునుగక లేక అవమగాహామగు, సేప్రజ్ఞా శిఖరమందుండకుండిన, ఆ ఎరుకయొక్క నిజస్వభావమును తద్వారా మన నిజసత్వ మును, దానిఘనతను తెలిసికొందుము.

బాహ్యముగా చూడరాని ఎరుకకు శిఖరము అంతఃకేంద్రములున్నట్లు, మన కెట్లు తెలుయును? దాని యతీతప్రకటనవలననే తెలియదగును. దాని సామాన్య స్వరూపము వల్లకాదు. దానిశిఖర మెల్లప్పటికి అతీతమైనది దాని యధోభాగము అందుకు దగ్గరగా యుండునవి దానిమీదయాధారపడునవి మాత్రము స్థూల ప్రపంచములోనున్న మన సామాన్య ప్రజ్ఞకు గోచరమగును. మనము దీనిని గుర్తించునది మనకు అతీతప్రజ్ఞానుభూతి సహజమైనప్పుడే—యోగమువలన.

18 సెప్టెంబరు 1947 శ్రీ అరవిందులు.

# ప్రస్తుత పరిస్థితులు

ప్రస్తుతపరిస్థితుల గురించి దుఃఖించు మీ విలేఖరులకు నేను నిర్వీణమైన నోదార్పును మాత్ర మివ్వగలనని జంకుచున్నాను. పరిస్థితులు చెడ్డవి, యతిచెడ్డగా మారుచున్నవి. నేడుణమందైన యత్యధిక విషమపరిణామ మొంద వచ్చును; ఇట్లనుట యసంభావితమైనను, ఇంకనుకూడ, యలజడిపడిన జగస్థితిలో యత్యధిక దుస్థితికన్న ఎక్కుడుదుస్థితి తటస్థించ వచ్చును. నూతన శ్రేష్ఠతర ప్రపంచము సృజింపబడవలెనన్న కొన్నియవకాశములు బయలుపరచి, కొన్నింటిని త్రోసివేయ వలసిన యవశ్యకత, వారెరుంగుట మంచిది. దీనిని మరొకసారికి వెనకవేయ కూడదు. సత్తాయందలి ప్రవృత్త లేక నిహిత విషయములను ఘర్షించి త్రోసి వేయుట లేక శుద్ధిక్రియకై, యంతస్థిత విలీనతనుండి వెలుగులోనికి బైలు పెట్టుట యోగమందువలె యవసరము. అదియునుకాక అరుణోదయమునకు ముందు నిశి చాలగాఢాంధకారముగా నుండుననియు, అరుణోదయము తప్పనిసరిగా యగుననియనెడి లోకోక్తిని వారు జ్ఞప్తినందుంచుకొన వలెను. మనము ఆకాం క్షించు నూతన ప్రపంచోదయము, పాత నేతలోనే యుంచక, యాకారముగూడ మార్పునొందవలె ననుటయేగాక, అంతస్థమునుండి వేరుమార్గముల రావలసినది వారెరుంగవలెను. బయటజరుగు విషాదకార్యములకు చింతించక, నూతన ప్రపంచ మేరూపుదాల్చినను దానికి సంసిద్ధతగానుండుటకు అంతః ప్రవృద్ధులు కావలెను.

జులై 18–1948 శ్రీ అరవిందులు.

# ముఖ్యోద్దేశ్యము

ప్రపంచము, భ్రాంతియనికాని, అనిత్యమనికాని యొప్పుకొనను. దైవమిచ్చుటను ప్రకృతి కావలను కేవలములోనుయున్నాడు. అవిద్య మనల అంధులను చేయుచున్నది. అందువలన ప్రపంచములోనుండు, అందుకుమించియుండు దైవమును కనుగొనలేకున్నాము. మన యునికియొక్క నిజమెద్దియో నెరుగలేకున్నాము. గెలువవలసినది ఆ యవిద్యయొక్కటే.

# పూర్ణయోగోద్దేశ్యము

దివ్య సాక్షాత్కారమందును, చేతస్సునందును ప్రవేశించి వాని ఆధీనతలో నుండుటయు, భగవానునికొరకే భగవానుని ప్రేమించుచు, మనస్వభావమునుభగవానుని స్వభావముగా మార్చుకొని, మన నిర్ణయములందు క్రియలయందు భగవంతుని యుపకరణములుగనుండుటే, ఈ యోగముయొక్క ముఖ్యోద్దేశ్యము. గొప్పయోగియగుటగాని అతిమానుష్యుడగుటగానికాదు. అట్లైనకావచ్చునేకాని, అట్లగుటయ కాదు. అహంకారముకొరకు, గర్వము సంతోషముకొరకు, భగవానుని, తడవు లాడుకొనుటకాదు, మోక్షము తదితరములన్నియు వచ్చినరావచ్చును. కాని, మన లక్ష్యమది కాదు. భగవానుడొక్కడే మన లక్ష్యము.

శ్రీ అరవిందులు.

# లక్ష్యము - ఉద్దేశ్యము

చేతనను, లేక ఎరుకను దైవమునకున్ముఖము గావించుట, యంతస్థితచేతనమండి, నెరుకతో బాహ్యజీవనముపై వ్యవహరించునప్పుడు నిగూఢచైత్యపురుషుని అభిముఖముగా దెచ్చి ఆ చైత్యపురుషుని శక్తిచే దివ్యజ్ఞానము దివ్యేచ్ఛ దివ్యప్రేమలందు ఐక్యతతో పరివర్తన మగుటకు సంసిద్ధతనొందుట ఇవి యోగ లక్ష్యములు. యోగచేతస్సు వృద్ధిపొందించుకొనుట అనగా సత్తానన్ని భూమికలందు విశ్వవ్యాప్తముచేసికొని దివ్యసత్తాను, దివ్యశక్తులను నెరింగి దైవముతో నేకమొందుట రెండవది. అతీతమానస చేతస్సుద్వారా అధిమానసమున కావలయుండు ఆద్య దేవుని సాన్నిధ్యము పొందుట, చేతస్సును ప్రకృతిని అతీతమానస మొనర్చుట. వీర్యవంతమైన దివ్యసత్యమును పృథివితత్వములోనికి దాని పరివర్తనాత్మిక యవరోహణను, ఉపలబ్ధిచెందనోపిన సాధనముగ తనను మార్చుకొనుట మూడవది.

శ్రీ అరవిందులు.

# కేనోపనిషత్

## ప్రథమ ఖండము:

కేనేషితం పతతి ప్రేషితం మనః – కేనప్రాణః ప్రథమః ప్రైతియుక్తః ।
కేనేషితాం వాచమి మాంవదన్తి చక్షుశ్శ్రోత్రం క ఉదేవో యునక్తి ॥

కేన ఈషితం పతతి మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః । కేన ఈషితాం వాచం ఇమాం వదన్తి చక్షుః శ్రోత్రం కః ఉ దేవః యునక్తి.

By whom missioned falls the mind shot to its mark? By whom yoked does the first life - breath move forward on its paths? By whom impelled is this word that men speak? What god set eye and ear to their workings.

ఎవని ప్రేరణమున తనలక్ష్యముపై ప్రయోగింపబడి మనస్సు పడుచున్నది? ఎవనిచే జోడింపబడి ప్రథమప్రాణ మద్దానిమార్గముల ముందుకు నడుచుచున్నది? మనుజులు వచించు ఈ వాక్కు ఎవనిచే ప్రేరితము? ఏ దేవుడు నేత్రమును చెవిని వాని పనులకు పూన్చుచున్నాడు? (1)

శ్రోత్రస్య శ్రోత్రం–మనసోమనో యద్వాచో హవాచంస ఉప్రాణస్య ప్రాణః ।
చక్షు షశ్చక్షురతి ముచ్యధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి ॥

శ్రోత్రస్య శ్రోత్రం మనసః మనః యత్ వాచః హ వాచం సః ఉ ప్రాణస్య ప్రాణః చక్షుషః చక్షుః అతిముచ్య ధీరాః ప్రేత్య అస్మాత్ లోకాత్ అమృతాః భవన్తి.

That which is hearing behind the hearing, mind of the mind, the word behind the speech, that too is life of the life - breath, Sight behind the sight.

the wise find their release beyond and passing forward from this world they become immortal.

ఏది వినికి వెనుకనుండు వినికియో, మనస్సుయొక్క మనస్సో, పలుకునకు వెనుకనుండు వాక్కో, అదియే ప్రాణముయొక్క ప్రాణము, చూపు వెనుక నుండుచూపు. ధీమతులు ముక్తి నావలగాంచి ఈ లోకమునుండి ముందుకుజని అమరు లగుచున్నారు. ( 2 )

నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనః నవిద్మో న విజానీమో యథైతదను శిష్యాత్ । అన్య దేవతద్విదితాదథో అవిదితాదధి – ఇతిశుశ్రుమ పూర్వేషాం యేన స్త ద్వ్యాచ చక్షిరే ॥

న తత్ర చక్షుః గచ్ఛతి న వాక్ గచ్ఛతి నో మనః। న విద్మః న విజానీమః యథా ఏతత్ అనుశిష్యాత్ అన్యత్ ఏవ తత్ విదితాత్ అథో అవిదితాత్ అధి ఇతి శుశ్రుమః పూర్వేషాం యే నః తత్ వ్యాచ చక్షిరే.

There sight attains not, nor speech attains, nor the mind. We know not nor can we discern how one should teach of That; for it is other than the known, and it is above beyond the unknown; so have we heard from the men of old who have declared That to our understanding.

అచ్చో దృష్టి ప్రసరింప నేఱదు, వాక్కు చేఱనేఱదు, మనస్సుఅందలేదు. మాకు తెలియదు దాని నెటుల బోధింప వలసినది మేము చింతింప జాలము. ఏలన, అది తెలిసిన దానికన్న వేరైనది, తెలియని దాని కావలను అతీత ముగ నున్నది. దానిని మాబుద్ధికి తెలియబఱచిన పూర్వుల వలన ఆ విధముగ మేము విన్నాము. ( 3 )

యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి – నేదం యదిద ముపాసతే ॥

యత్ వాచా అనభ్యుదితం యేన వాక్ అభ్యుద్యతే తత్ ఏవ బ్రహ్మ త్వం

విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

That which remaius unexpressed by the wood, that by which the word is expressed, know that indeed to be the Brahman, not this which men follow after here.

ఏది వాక్కుచే ఉచ్చరింప బడకున్నదో దేనిచేవాక్కు ఉచ్చరింపబడు చున్నదో అదే బ్రహ్మమని ఎఱుంగుము- దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) చున్నారో ఇది కాదు. (4)

యన్మనసా న మనుతే యేనాహుర్మనోమతం ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదంయదిద ముపాసతే ॥

యత్ మనసా న మనుతే యేన ఆహుః మనః మతం తత్ ఏవ బ్రహ్మ త్వం విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

That which thinks not by the mind, * that by which the mind is thought, know That indeed to be the Brahman, not this which men follow after here.

ఏది మనస్సుచే చింతింపదో * దేనివలన మనస్సు చింతితముకాదో అదే బ్రహ్మమని ఎఱుంగుము. దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) చున్నారో ఇది కాదు. (5)

యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥

యత్ చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి తత్ ఏవ బ్రహ్మ త్వం విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

---

* or that which one thinks not with the mind

* దేనిని మనుజుడు మనస్సుతో చింతింపడో

That which sees not with the eye ‡ that by which one sees the eye's seeings, know That indeed to be the Brahman, not this which man follow after here.

ఏది కనులతో చూడదో ‡ ఒకడు దేని వలన కనులచూపులను చూచుచున్నాడో, అదే బ్రహ్మమని ఎఱుంగుము. దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) చున్నారో ఇది కాదు. (6)

యచ్ఛ్రోత్రేణ నశ్శృణోతి యేనశ్రోత్ర మిదం శ్రుతం।
తదేవబ్రహ్మత్వం విద్ధినేదం యదిద ముపాసతే॥

యత్ శ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రం ఇదం శ్రుతం తత్ ఏవ బ్రహ్మ త్వం విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

That which hears not with the ear § that by which hearing is heard, know That to be the Brahman, not this which men follow after here.

ఏది చెవితో వినదో § దేనివలన వినికి వినబడునో, అది బ్రహ్మమని ఎఱుంగుము. దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) చున్నారో ఇది కాదు. (7)

యత్ప్రాణేన ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥

యత్ ప్రాణేన స ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే తత్ ఏవ బ్రహ్మ త్వం విద్ధి న ఇదం యత్ ఇదం ఉపాసతే.

---

‡ that which one Sees not wiih the eye
‡ దేనిని మనుజుడు కనులతో చూడడో

§ that which one hesrs not with the ear
§ దేనిని మనుజుడు చెవితో వినడో

That which breathes not with the breath, * that by which life - breath is led forward in its paths, know that indeed to be the Brahman, not this which man follow after here.

(ఏది ప్రాణముచే ప్రాణవంతముకాదో) ఏది శ్వాసముతో ఊపిరిసల్పదో, * దేనివలన ప్రాణవాయు వద్దాని మార్గముల ముందుకు నడుపబడుచున్నదో, అదే బ్రహ్మమని ఎఱుంగుము. దేనిని మనుజులిక్కడ అనుసరించు (ఉపాసించు) చున్నారో ఇది కాదు. (8)

## ద్వితీయ ఖండము:

యదిమన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనంత్వం వేత్థబ్రహ్మణోరూపం ।
యదస్యత్వం యదస్యదేవే ష్వథను మీమాంస్యమేవ తే మన్యే విదితమ్ ॥

యది మన్యసే సువేద ఇతి దభ్రం ఏవ అపి నూనం త్వం వేత్థ బ్రహ్మణః రూపం । యత్ అస్య త్వం యత్ అస్య దేవేషు అథను మీమాంస్యం ఏవ తే మన్యే విదితమ్.

If thou thinkest that thou knowest It will, little indeed dost thou know the form of the Brahman. That of it which is thou, that of it which is in the gods, this thou hast to think out. I think it known.

నేను దానిని బాగా తెలిసికొన్నానని నీ వనుకొన్నచో, నీవు తెలిసికొనినది నిజముగ అతిస్వల్పమగు బ్రహ్మరూపము. దానిలో నెద్దినీవో, దానిలో నెద్ది దేవతలలో నున్నదో, దీనినినీవుచింతింపవలెను. నేనది తెలిసినదిగ తలంచుచున్నాను. (1)

నాహం మన్యే సువేదేతి నోనవేదేతి వేదచ ।
యోనస్తద్వేద తద్వేద నోనవేదేతి వేదచ ॥

న అహం మన్యే సు వేద ఇతి నో న వేద ఇతి వేద చ యః తత్ వేద తత్

* that which one breathes not - i.e. smells not - with the breath

* మనుజుడే శ్వాసముతో ఊపిరిసల్పడో - ఆఘ్రాణించడో -

వేద నో న వేద ఇతి వేద చ.

I think not that I know It well and yet I know that It is not unknown to me. He of us who knows it, knows that; He knows that It is not unknown to him.

నాకది బాగా తెలియునని నేను తలంచను, అయినను నాకది తెలియనిది కాదని నాకు తెలియును. మనలో దానిని తెలిసిన వాడద్దాని నెఱుగును; తనకది తెలియనిది కాదని అత డెఱుంగును. ( 2 )

యస్యామతం తస్యమతం మతంయస్యన వేదసః ।
అవిజాతం విజానతాం విజ్ఞాత మవిజానతాం ॥

యస్య అమతం తస్య మతం మతం యస్య న వేద సః అవిజాతం విజానతాం విజ్ఞాతం అవిజానతాం.

He by whom It is not thought out, has the thought of It; he by whom It is thought out, knows It not. It is unknown to the discernment of those who discern of It, by those who seek not to discern of It, It is discerned.

ఎవనిచే నది చింతింపబడలేదో దానిచింతన మతనికిగలదు. ఎవనిచే నది చింతింప బడునో దాని నత డెఱుగడు. దానినిగూర్చి విచారముచేయువారి వివేకమున కది తెలియని దగుచున్నది. దానినిగూర్చి విచారముచేయ నొల్లనివారిచేనది వివేకింప బడుచున్నది. ( 3 )

ప్రతిబోధ విదితం మత మమృతత్వం హివిన్దతే ।
ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతేఽమృతమ్ ॥

ప్రతిబోధవిదితం మతం అమృతత్వం హి విన్దతే, ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతే అమృతమ్.

When it is known by perception that reflects it, then one has the thought of it, for one finds immotatily; by the self one finds the force to attain and by knowledge one finds immortality.

దానిని ప్రతిబింబించు బోధచేనది తెలిసికొన బడినపుడంత యొకడు దాని చింతనము గల్గియున్నాడు. ఏలన అతడు అమృతత్వము కాంచుచున్నాడు- ఆత్మవలన ప్రాప్తినొందుటకు శక్తిని కాంచుచున్నాడు. జ్ఞానముచే అమృతత్వమునుబడయును.(4)

ఇహచేదవేదీ దథ సత్యమస్తి నచేదిహా వేదీన్మమహతీ వినష్టిః ।
భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతాభవన్తి ॥

ఇహ చేత్ అవేదీత్ అథ సత్యం అస్తి న చేత్ ఇహ అవేదీత్ మహతీ వినష్టిః భూతేషు భూతేషు విచిన్త్య ధిరాః ప్రేత్య అస్మాత్ లోకాత్ అమృతాః భవన్తి.

If here one comes to tnat knowledge then one truely is, if here one comes not to the knowledge, then great is the perdition. The wise distinguish that in all kinds of beings and they pass forward from this world and become immortal.

ఇక్కడ ఒకడాజ్ఞానమును చెందినట్లయిన ఒకడంత యదార్థముగ నున్నాడు. ఇక్కడ ఒకడాజ్ఞానమును చెందనట్లయిన వినాశము మహత్తరమైన దగునంత. ధీమతలు భూతములన్నిటి నుండి దానిని వివేకించి ఈలోకమునుండి ముందుకు జని అమృతత్వమును బడయుదురు. (5)

## తృతీయ ఖండము :

బ్రహ్మహ దేవేభ్యో విజిగ్యే తస్యహ బ్రహ్మణో విజయే దేవా అమహీయన్తత ।
ఐక్షన్తా స్మాకమేవాయం విజయోఽస్మాక మేవాయం మహిమేతి ॥

బ్రహ్మ హ దేవేభ్యః విజిగ్యే తస్య హ బ్రహ్మణః విజయే దేవాః అమహీయన్త తే ఐక్షన్త అస్మాకం ఏవ అయం విజయః అస్మాకం ఏవ అయం మహిమా ఇతి.

The etrnal conquered for the gods and in that victory of the Eternal gods came to greatness. This was what they saw, "ours is this victory, ours is this greatness."

(బ్రహ్మ) నిత్యుడు దేవతలకుగాను జయించెను. ఈ నిత్యుని (బ్రహ్మ) విజయమునందు దేవతలు మహాత్వము గాంచిరి. వారు చూచినదిది 'మాది వి జయము మాది ఈమహాత్వము' (1)

తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యోహ ప్రాదుర్బభూవ ।
తన్నవ్య జానన్త కిమిదం యక్షమితి ॥

తత్ హ ఏషాం విజజ్ఞౌ తేభ్యః హ ప్రాదుర్బభూవ తత్ న వ్యజానన్త కిం ఇదం యక్షం ఇతి.

That marked this thought of theirs; to them That became manifest. They could not discern of that, what was this mighty Daemon ?

ఈ వారితలంపునది (తెలిసికొనినది) గుర్తించినది; వారికది ప్రత్యక్ష మాయెను. వారు దానిని వివేకింపజాలరైరి, ఇది ఏమద్భుతమో? (ఈ యక్షమేమిటో)? (2)

తేఽగ్నిమబ్రువన్ జాతవేద ఏతద్విజానీహి ।
కిమేతద్య క్షమితి తథేతి ॥

తే అగ్నిః అబ్రువన్ జాతవేదః ఏతత్ విజానీహి కిం ఏతత్ యక్షం ఇతి తథా ఇతి.

They said to Agni "O knower of all Births, this discern, what is this mighty Daemon" He said, "So be it."

వారు అగ్నితోననిరి "ఓ ఎల్లపుట్టుకల నెఱిగిన వాడా, దీనిని తెలిసికొనుము, ఇది ఏమహాద్భుతమో (ఈయక్షమేమిటో)." అతడనెను, "అలాగేయగుగాక."(3)

తదభ్య ద్రవత్తమభ్యవదత్కోఽసీతి అగ్నిర్వా ।
అహమస్మీ త్యబ్రవీజ్ఞాత వేదావా అహమస్మీతి ॥

తత్ అభ్యద్రవత్ తం అభ్యవదత్ కిం అసి ఇతి అగ్నిః వా అహం

అస్మి ఇతి. అబ్రవీత్ జాతవేదాః వా. అహం అస్మి ఇతి.

He rushed upon that; It said to him, "Who art thou." "I am Agni, he said "and I am the Knower of all Births."

దానిపై కతడురికెను; అతనికది చెప్పెను 'నీ వెవడ ?', 'నే నగ్నిని (జాతవేదుడను) ఎల్లపుట్టుకల నెఱింగినవాడను' అనె నతడు. (4)

తస్మింస్త్వయి కింవీర్య మిత్యపీదగ్ం సర్వం ।
దహేయం యదిదం పృథివ్యామితి ॥

తస్మిన్ త్వయి కిం వీర్యం ఇతి అపి ఇదం సర్వం దహేయం యత్ ఇదం పృథివ్యాం ఇతి.

"Since such thou art, what is the force in thee?" "Even all this I can burn, all this that is upon the earth."

"అట్టిది నీవగుటచే, నీ యందలి శక్తియెయ్యది?" "ఇదంతయును దహింపగలను, పృథివి యందుడు ఇదంతయు" (5)

తస్మై తృణం నిదధా వేతద్దహేతి తదుపప్రేయాయ సర్వజవేన
తన్నశశాక దగ్ధుం సతత ఏవ నివవృతే నైతదశకం విజ్ఞాతుం
యదేతద్యక్షమితి ॥

తస్మై తృణం నిదధౌ ఏతత్ దహ ఇతి తత్ ఉపప్రేయాయ సర్వజవేన తత్ న శశాక దగ్ధుం సః తతః ఏవ ని వవృతే న ఏతత్ అశకం విజ్ఞాతుం యత్ ఏతత్ యక్షం ఇతి.

That set before him a blade of grass; "This burn." He went to it with al his speed and he could not burn it. Even there he ceased, even thence he returned; "I could not discern of That, what is this mighty Daemon."

అది అతనిముందొక గడ్డిపోచ నుంచె; "దీనిని దహించు." అతడు దానిపైకి తన సర్వజవముతో నెళ్లెను. దానిని దహింపలేక పోయెను, అక్కడనే

నిలిచిపోయెను, అక్కడనుండే మరలిపోయెను; "నేను దానిని తెలిసికొనలేకపోతిని, ఇది ఏ మహాద్భూతమో (ఈయక్షమేమిటో)" అనెను. (6)

అథవాయు మబ్రువన్ వాయవే।
తద్విజానీహి కిమే తద్య క్షమిది తథేతి ॥

అథవాయుం అబ్రువన్ వాయో ఏతత్ విజానీహి కిం ఏతత్ యక్షం ఇతి తథా ఇతి.

Then they said to Vayu, "O Vayu, this discern, what is this mighty Daemon." He said, "So be it."

వారు వాయువుతోననిరి, "ఓ వాయూ; దీనిని తెలిసికొనుము, ఇది ఏమహాద్భూతమో (ఈ యక్షమేమిటో)" "అలాగే యగుగాక" అనె నతడు. (7)

తదభ్యద్ర వ త్తమ భ్యవదత్కో౽సీ తివా యుర్వా।
అహమస్మీ త్యబ్రవీన్మాతరి శ్వావా అహ మస్మీతిః ॥

తత్ అభ్యద్రవత్ తం అభ్యవదత్ కిం అసి ఇతి. వాయుః వా అహం అస్మి ఇతి అబ్రవీత్ మాతరిశ్వా వా అహం అస్మి ఇతి.

He rushed upon That, It said to him, "Who art thou?" "I am Vayu," he said, "and I am he that expands in the Mother of things."

దానిపైకత దురికె అది అతనికనెను, "నీ వెవరు ?" "నే వాయువు," అనె నతడు, "విషయముల మాతయందు విస్తరించు నతడు నేను" (8)

తస్మిం స్త్వయికిం వీర్యమిత్య పీదగ్ సర్వమాదదీయం
యదిదం పృథివ్యా మితి ॥

తస్మిన్ త్వయి కిం వీర్యం ఇతి అపి ఇదం సర్వం ఆదదీయం యత్ ఇదం పృథివ్యాం ఇతి.

"Since such thou art, what is the force in thee?" "Even all this I can take for myself, all this that is upon the earth."

" అట్టిది నీ వగుటచే, నీ యందలిశక్తి యెయ్యది " " ఇదంతయును నేను నాకై తీసికొనగలను, పృథివి యందుండిన దంతయు " (9)

తస్మైతృణం నిదధా వేతదా దత్స్వేతి తదుపప్రేయాయ
సర్వజవేన తన్నశశా కాదాతుం సతత ఏవ నివవృతే
నైతదశకం విజ్ఞాతుం యదే తద్యక్షమితి ॥

తస్మై తృణం నిదధౌ ఏతత్ ఆదత్స్వ ఇతి తత్ ఉపప్రేయాయ సర్వజవేన తత్ న శశాక ఆదాతుం సః తతః ఏవ నివవృతే న ఏతత్ అశకం విజ్ఞాతుం యత్ ఏతత్ యక్షం ఇతి.

That set before him a blade of grass; "This take." He went towards it with all his speed and he could not take it. Even there he ceased, even thence he returned; "I could not discern of That, what is this mighty Daemon."

అది అతనిముందొక గడ్డిపోచనుంచె ; " దీనిని తీసికొనుము " అతడు దానివైపు తన సర్వజవముతో వెళ్లెను అతడుదానిని తీసికొనలేకపోయెను. అక్కడనే అతడు నిలిచిపోయెను, అక్కడనుండే అతడు మరలిపోయెను " నేను దానిని తెలిసికొనలేక పోతిని. ఇది ఏ మహాద్భూతమో (ఈ యక్షమేమిటో)" (10)

అథేన్ద్రమబ్రువన్మఘ వన్నేతద్విజానీహి కిమే తద్యక్షమితి
తథేతి తదభ్యద్రవత్ తస్మాత్తిరోదధే ॥

అథ ఇన్ద్రం అబ్రువన్ ఏతత్ విజానీహి కిం ఏతత్ యక్షం ఇతి తథా ఇతి అభ్యద్రవత్ తస్మాత్ తిరోదధే.

Then they said to Indra, "Master of plenitude, get thou the knowledge, what is this mighty Daemon." He said, "So be it" He rushed upon That, That vanished. from before him.

అంత వా రింద్రునితోననిరి " ( మఘవంతుడా ) మహాదాధిపా, నీవు తెలిసి

కోనుము, ఇది ఏ మహాద్భూతమో (ఈ యక్షమేమిటో)" అతడనెను, "అలాగేయగు గాక." దానిపై కతడురికెను, అదతని ఎదుటనుండి తిరోహితమయ్యెను. (11)

సతస్మిన్నే వాకాశే స్త్రియ మాజగామ బహు శోభమానా
ముమాం హైమవతీం తాగ్ం హోవాచ – కిమే తద్యక్ష మితి ॥

సః తస్మిన్ ఏవ ఆకాశే స్త్రియం అజగామ బహు శోభమానాం ఉమాం హైమవతీం తాం హ ఉవాచ కిం ఏతత్ యక్షం ఇతి.

He in the same ether came upon the woman, even upon Her who shines out in many forms, Uma daughter of snow summits. To her he said, "What was this Mighty Daemon?"

అత డాయాకాశమునందే స్త్రీని బహురూపములతో శోభిల్లు ఉమాదేవినే హిమవత్పర్వత పుత్రిని తారసిల్లెను. ఆమెతో నతడనె "ఇది ఏ మహాద్భూతమో, (ఈ యక్షమేమిటో" (12)

## చతుర్థ ఖండము:

సా బ్రహ్మేతి హోవాచ బ్రహ్మణో వా ఏతద్విజయే మహీ
యధ్వమితి తతో హైవ విదాఞ్చకార బ్రహ్మేతి ॥

సా బ్రహ్మ ఇతి హ ఉవాచ బ్రహ్మణః వా ఏతత్ విజయే మహీయ ధ్వం ఇతి తతః హ ఏవ విదాఞ్చకార బ్రహ్మ ఇతి.

She said to him "It is the Eternal. Of the Eternal is the victory in which ye shall grow to greatness." Then alone he came to know that this was the Brahman.

ఆమె చెప్పిన దాతనికి, "అది (బ్రహ్మము) శాశ్వతుడు. దేనివలనమీరు మహత్వమందు వృద్ధిజెందగలరో ఆ విజయము (బ్రహ్మది) శాశ్వతునిది." అంతనే యతడిది బ్రహ్మమని తెలిసికొనగల్గెను. (1)

తస్మాద్వా ఏతే దేవా అతితరామి వాన్యాన్ దేవాన్ యదగ్ని వాయు
రిన్ద్రస్తే హ్యేనన్నే దిష్టం పస్పర్శుస్తే.........

తస్మాత్ వా ఏతే దేవాః అతితరాం ఇవ అన్యాన్ దేవాన్ యత్ అగ్నిః వాయుః ఇన్ద్రః! తే హి ఏనత్ నేదిష్టం పస్పర్శు.........

Therefore are these gods as it were beyond all the other gods, even Agni and Vayu and Indra because they come nearest to the touch of That.......

కావున ఈ దేవత లితర దేవతలందరికన్న అతీతులుగనున్నారు, అగ్ని వాయు ఇంద్రులనున్నా, ఏలన దానిస్పర్శకు అతి సమీపముగ వచ్చిరి. *......(2)

తస్మాద్వా ఇన్ద్రోఽతితరామి వాన్యాన్ దేవాన్
స హ్యేనన్నేదిష్టం పస్పర్శ స హ్యేనత్ప్రథమో
విదాఞ్చకార బ్రహ్మేతి ॥

తస్మాత్ వా ఇంద్రః అతితరాం ఇవ అన్యాన్ దేవాన్ సః హి ఏనత్ నేదిష్టం పస్పర్శ సః హి ఏనత్ ప్రథమో విదా ఞ్చకార బ్రహ్మ ఇతి.

Therefore is Indra as it were beyond all the other gods because he came nearest to the touch of That, because he first knew that It was the Brahman.

కావున ఇంద్రుడితర దేవతలందరికన్న అతీతుడయినట్లున్నాడు- ఏలన

* ఆదియందు వల్లించినవారి పొరపాటువలననో లేక ఈ వలి వ్రాతప్రతుల యందలి తప్పువలననో ఈ మంత్రమందలి మిగత భాగమతిభ్రష్టం పట్టినది. అదీ రీతినున్నది. "They he first came to know that it was the Brahman" "వారు అతడు అది బ్రహ్మమని తెలిసికొన మొదటవచ్చినది." ఇది వాస్తవ విషయంకాదు- భావముకాదు- వ్యాకరణముకాదు. మూడవమంత్రముయొక్క చివరిభాగము దీనిలో ప్రవేశించి రెండవ మంత్రముయొక్క అసలు చివరభాగ మును లుప్తపఱచినది.

దాని స్పర్శకు అత్యధిక సన్నిహితముగ వచ్చెను, నదిబ్రహ్మమని ముందుగా నతడు తెలిసికొనెను. (3)

తస్యైష ఆదేశో యదేత ద్విద్యుతో వ్యద్యుతదా
ఇతీన్న్య మీమిషదా ఇత్యధి దైవతమ్ ॥

తస్య ఏషః ఆదేశః యత్ ఏతత్ విద్యుతః వ్యద్యు తత్ ఆ ఇతీ న్యమీమి షత్ ఆ ఇతి అధి దైవతమ్.

Now this is the indication of That,—as is this flash of lightning upon us or, as is this falling of the cyelid, so in that which is of the gods.

దానియొక్క సూచన ఇప్పుడిది,— మనపై మెఱపు మేఱసినట్లు, లేదా ఈ రెప్పపాటువలె, దేవతలదైన దెద్దియో (అధిదైవతమైన) దానియందింతే. (4)

అథాధ్యాత్మం యదేత ద్గచ్ఛతీ వచమనోఽనేన
చైతదుపస్మర త్యభీక్ష్ణం సంకల్పః ॥

అథ అధ్యాత్మం యత్ ఏతత్ గచ్ఛతి ఇవ చ మనః అనేన చ ఏతత్ ఉపస్మరతి అభీక్ష్ణం, సఙ్కల్పః.

Then in that which is of the Self—as the motion of this mind seems to attain to That and by it afterwards the will in the thought continully remembers it.

ఇక నాత్మదైన దెద్దియో దానియందు,— ఈ మనస్సుయొక్క వ్యాపారము దానిని చెందినదని కనుపడినట్లు, మరియు దానివలన తర్వాతచింతనమందలి ఇచ్ఛ దానిని సదా జ్ఞాపకముంచుకొనునటుల. (5)

తద్ధతద్వనం నామ తద్వన మిత్యుపాసి తవ్యం స య
ఏతదేవం వేదాభి హైనం సర్వాణిభూతాని సంవాఞ్ఛన్తి ॥

తత్ హ తద్వనం నామ తద్వనం ఇతి ఉపా సితవ్యం సః యః ఏతత్ ఏవం

వేద అభి హ ఏనం సర్వాణి భూతాని సంవాఞ్ఛన్తి.

The name of That is 'That Delight;' as That Delight one should follow after it. He who so knows That, towards him verily all existences yearn.

ఆ ఆనందమని దానినామము; అది ఆనందమని మనుజుడుదానిని (ఉపాసింప వలెను) వెంబడించవలెను, దానినాలా గెఱిగినవానిని సర్వభూతములు నిజముగా వాఞ్ఛించు చున్నవి. (6)

ఉపనిషదం భోబ్రూహీ త్యుక్తాత ఉపనిషద్బ్రాహ్మీం
వావత ఉపనిషద మబ్రూమేతి ॥

ఉపనిషదం భో బ్రూహి ఇతి ఉక్తా తే ఉపనిషత్ బ్రాహ్మీం వావ తే ఉపనిషదం అబ్రూమ ఇతి.

Thou hast said "speak to me Upainshad"* spoken to thee is Upanishad. Of the Eternal verily is the Upanishad that we have spoken.

"నాకు ఉపనిషత్తుచెప్పుము" * నీవంటివి- నీకు ఉపనిషత్తు చెప్పబడినది- (బ్రహ్మనుగూర్చి) శాశ్వతునిగూర్చి నది వాస్తవముగా మేము చెప్పిన ఉపనిషత్తు. (7)

తస్యైతపోదమః కర్మేతి ప్రతిష్ఠా వేదా
స్సర్వాఙ్గాని సత్యమాయతనం ॥

తస్యై తపః దమః కర్మ ఇతి ప్రతిష్ఠా వేదాః సర్వాఙ్గాని సత్యం ఆయతనం.

Of this kuowledge austerity and self conquest and works are the foundation,

* ఉపనిషత్తనగా అంతర్ జ్ఞానము, ఎయ్యది తుదిసత్యమందు ప్రవేసించి దానియందు స్థిరపడుచున్నదో అది.

Upanishad means inner knowledge, that which enters into the final Truth and settles in it.

the Vedas are its limbs, truth is its dwelling place.

ఈ జ్ఞానమునకు తపస్సు (అంతరేంద్రియ నిగ్రహము), ఆత్మ నిగ్రహము, కర్మములు పునాదులు, వేదములు దానిఅంగములు, సత్యము దానియునికిపట్టు. (8)

యోవా ఏతామేనం వేదా పహత్య పాప్మానమనన్తే
స్వర్గేలోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి ॥

యహః వా ఏతాం ఏవం వేద అపహత్య పాప్మానం అనన్తే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి.

He who knows this knowledge, smites evil away from him and in tha vaster world and infinite heaven finds his foundation, yea he finds his foundation

(ఈ తీరున) ఈ జ్ఞానము నెవడెఱుగు చున్నాడో తననుండి పాపమును హంతమొనర్చి ఆ విశాల తరలోకములో అనంత స్వర్గములో స్థిరస్థాయి యగు చున్నాడు- స్థిరస్థాయి యగుచున్నాడుగదా! (9)